# విరహ గీతం

(లలిత గీతాలు)

ముత్యాల సరాలలో



దుర్గాప్రసాద్

నలుబది మూడవ పూజా పుష్పము

# విరహ గీతం

(లలిత గీతాలు)

ముత్యాల సరాలలో





దుర్గాప్రసాద్

ప్రథమ ముద్రణము 500 ప్రతులు



ప్రమాథినామ సంవత్సర ఆశ్వయుజ శుద్ధ దశమి

1999 సంవత్సరము అక్టోబరు నెల

వెల రు. 20-00

ముద్రణము :
డి. బి. ప్రింటర్సు, విజయవాడ-3.

ప్రతులకు :
విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్
విజ్ఞాన భవన్, బ్యాంకు స్ట్రీట్, హైదరాబాదు.
అన్ని బ్రాంచీలలో లభ్యమగును.

పి. దుర్గారావు, యం. ఓ. యల్.
అడవిదేవులపల్లి పోస్టు,
(వయా) మిర్యాలగూడ. నల్లగొండజిల్లా, 508 207.

# వినమ్ర వాక్యము

"విరహగీతం" అను ఈ లలిత గీతాల పుస్తకమును నలుబది మూడవ పూజా పుష్పముగా తెలుగు సాహితీ సరస్వతీ చరణారవిందముల భక్తి పూర్వకముగా సమర్పించుకొనుచున్నాను. ఈ [illegible]థము ముత్యాల సరములలో గూర్చబడినది.

ఉపాధ్యాయ [illegible]ని నిర్వహించుకొనుచు అప్పుడప్పుడు వ్రాసికొనినవి ఈ గీతములు, మధుర భక్తిని మనోహరముగా వ్రాసికొనిన మహా భక్తురాలు మీరాబాయి, శ్రీ గోదాదేవి, కీ॥ శే॥ దేవులపల్లి వేంకట కృష్ణశాస్త్రిగారి మధుర గీతములే నా యీ లలిత గీతములకు ప్రేరణయని చెప్పవచ్చును.

ఈ గ్రంథమున శ్రీకృష్ణ దేవుని నాయకునిగా జేసికొని, భక్తితో రచించిన గేయములను శ్రీకృష్ణుని చరణారవిందములకే సమర్పణము గావించుచున్నాను.

ఇందు నాయకునిగా వర్ణింపబడిన శ్రీకృష్ణుడు (మురళీలోలుడేగాక) పరబ్రహ్మ స్వరూపముగను. ఇందలి గోపికా విరహము పరమేశ్వరుని యందు లీనమగుటకు వేదనా పూర్వకమగు జీవి ప్రార్థనగా భావింపవలెను.

ఇదివఱకు ప్రచురించిన లలిత గీతములను ప్రశం సించుచు, పత్రికలు, ప్రముఖులు వ్రాసియున్నారు, వారం దరికీని నా నమస్సుమాంజలులు. ఇదే విధముగా మరి కొన్ని గ్రంథములు ప్రచురింపవలెనని నా ఆకాంక్ష.

ఈ గ్రంథమునందు గల 108 గీతములు సాధ్య మైనంతవఱకు పాడుకొనుటకు వీలుగా లలిత పదములతో గుది గ్రుచ్చబడినవి. ఆకాశవాణి, టీ.వి.లలో పాడు కొను టకు వీలుగా తేలిక భాషలో నున్నవి. కృష్ణభక్తి పరిపూర్ణ మైనవి.

రస హృదయములను ఏ మాత్రము స్పందింప జేసి నను ధన్యునిగా భావించుకొందును.

— రచయిత.



# మాతృ వందనము!

ఓహో! నా జన్మభూమి! ఓహో! నా మాతృభూమి!
ఓహో! నా కన్నతల్లి ! వందన మిదె ప్రియభారతి!
ఓహో! నా జన్మభూమి! ఓహో నా మాతృభూమి!

సకలసస్య శ్రీనిలయిని! సాధుమార్గ శుభదాయిని!
సర్వలోక జనపూజిత! సామగాన సురభాషిణి!
సకలధర్మ సహజీవన సంస్కృతి విలసిత శోభిని!
పుణ్యకర్మ సువిరాజిత పూర్ణకలా తేజోమయి!

ఓహో! నా జన్మభూమి! ఓహో నా మాతృభూమి!
ఓహో! నా కన్నతల్లి ! వందన మిదె ప్రియభారతి!

గంగ యమున గోదావరి కావేరీ కృష్ణవేణి!
ఉన్నత హిమగిరి శిఖరము లొప్పిన శుభ కల్యాణీ!
అడుగడుగున పుణ్యభూము లమరు విమల సౌమ్యమూర్తి!
మధుర కావ్యగేయ శిల్ప మంజులతర శివగాయని!

ఓహో! నా జన్మభూమి! ఓహో నా మాతృభూమి!
ఓహో! నా కన్నతల్లి! వందనమిదె ప్రియభారతి!

సత్యము శివ సుందరములు సర దిశలు విలసిల్లిన
ఈ సుందర కర్మభూమి! ఈ ఎ దివ్యధాత్రి!
నీ స్వరూప విలసనమే! నీ యనం దర్శనమే!
అమ్మా! నీ యాశీస్సులు నలరి వేడుచుంటి నమ్మ!

ఓహో! నా జన్మభూమి! ఓహో నా మాతృభూమి!
ఓహో! నా కన్నతల్లి! వందనమిదె ప్రియభారతి!
ఓహో! నా జన్మభూమి! ఓహో! నా మాతృభూమి!

# దేవతా వందనము

వాణీ! వీణాపాణీ! వందిత జన సకలలోక!
కామిత విద్యాప్రసన్న! కల్యాణీ! శుభదాయిని!
వాణీ! వీణాపాణీ! వందిత జన సకలలోక!

యోగివంద్య జ్ఞానజ్యోతి! సారస్వత స్వాదురూప!
మృదుపద సుందరభావన! కవికులజన వరదాయిని!
విశ్వరూప! విమలచరిత! అక్షరరూపిణి భారతి!
లలిత లలిత పదశోభిని! లాలిత సుందర భాషిణి!

వాణీ! వీణాపాణీ! వందిత జన సకలలోక!
కామిత విద్యాప్రసన్న! కల్యాణీ! శుభదాయిని!

ఉదయసంధ్య అరుణారుణ రేఖాంకిత సదయనేత్రి
కరుణామయి! కావ్యగేయ గాన కళా సుప్రసన్న!
అజరుద్రాచ్యుత పూజిత! ఆదిరూప! సుఖదాయిని!
బుధసేవిత! ధవళవర్ణ! భూరికృపానంద లహరి!

వాణీ! వీణాపాణీ! వందిత జన సకలలోక!
కామిత విద్యాప్రసన్న! కల్యాణీ! శుభదాయిని!

లలితకళానందమూర్తి విలసిత చైతన్యమూర్తి!
మానవ విజ్ఞాన భాండ మధుర సుధాకలశహస్త!
శివరూపిణి! ప్రణవనాద! తేజోమయి! దీపరేఖ!
అఖిల జీవకోటి హృదయ! ఆనందిని! శ్రీదుర్గా!

వాణీ! వీణాపాణీ! వందిత జన సకలలోక!
కామిత విద్యాప్రసన్న! కల్యాణీ! శుభదాయిని!
వాణీ! వీణాపాణీ! వందిత జన సకలలోక!

# కల్యాణి శ్రీదుర్గ !

కల్యాణి శ్రీదుర్గ! కరము వేడుచునుంది
కనులార! నను జూచి కాచి రక్షింపవూ!

అర్ధి భావముతోని యరని కాపాడుమా!
తీయనీ పలుకిచ్చి తీరుగా దయతోని!

కల్యాణి శ్రీదుర్గ! కరము వేడుచునుంటి!
కనులార నను జూచి గాచి రక్షింపవూ!

అడుగడుగు నందునను నమృత వాక్కుల నిచ్చి
మధురాతి మధురమౌ మధుర భావములిచ్చి!
సంగీత సాహిత్య సరసమౌ గీతికల
నా నోట బలికింపు సత్యసుందరములను! ॥కల్యాణి॥

కొండ కోనలయందు కోకిలలు బాడినటు!
సెలయేటి జాలులటు! చిరుగాలి తరగలటు!
ఉదయ సంధ్యలలోని కదిలేటి కాంతులటు!
నా గొంతురాగాల నవ్యతల నొలికించు! ॥కల్యాణి॥

లలిత కళలను నిచ్చి లాలిత్యమును గూర్చి
విభుని వశబఱచుకొను విమలతను దయచేయి!
శ్రీమురళి జేరుకొను శ్రీని దయజేయుమా!
పాటలో పాటనయి పల్లవిని యగునటుల!

కల్యాణి శ్రీదుర్గ ! కరము వేడుచునుంటి!
కనులార! జూచి నను గాచి రక్షింపవూ!



## స మ ర్ప ణ

ఎన్ని మారులు పాడినా
వన్నె దరుగదు నీ పాటకు!

ఎన్ని మారులు విన్నా నీ మురళీ స్వనాలకు
వన్నె లేమీ తరుగవు గదా!

మఱచి పోవాలన్నా మాధవా!
మఱపురాదు నీ పేరు!

విడిచి పోవాలన్నా వీడిపోదు
విడివడని బంధ మిది యేనాటిదో!

తీయని నీ మురళి పాట
తీపిదనం కురిపిస్తుం దెప్పుడూ!

నర్తన జేస్తుం దెప్పుడూ నా యెదలో
నవ్య సుందరములను వెలువరిస్తూ!

అందుకే అర్పిస్తున్నా
ఆత్మార్పణమని!
ఆవేదనతో నా మధుర గీతాలను!

యుగయుగాల నాటి వీ మధుర పదాలు.
తరతరాల నాటి దీ హృదయావేదన !

# విరహ గీతం

## (లలిత గీతాలు - ముత్యాల సరాలలో)

### హృదయ వీణా !

హృదయవీణా ! విరహగీతిని !
మధుర స్వరముల బలుకవమ్మా !
మాధవుని శ్రీ మహిత గుణముల
మదిని దలచి పాడవే ! ||హృదయవీణా||

ఉదయ సంధ్యల రుచిర కాంతుల
యూయలకు వలె నూగవమ్మా !
అఖిల జగముల యాత్మనాథుని
యమల పదములు బాడవే! ||హృదయవీణా||

కుహూ కుహూ యని కోకిలలకు వలె
కోటి గొంతుల బాడవమ్మా!
చిగురు పూవుల చిత్రముల వలె
చిన్నెలను నొలికింపవే ! ||హృదయవీణా||

హంసవలె నాకాశవీధిని
యలరి పరుగుల నెత్తవమ్మా!
జలధి వలె తరగలను లేపుచు
వలపు వెన్నెల జిలుకవే ! ||హృదయవీణా||

మురళి యూదే మోహనాంగుని
మోదమలరగ భక్తితోడుత !
మధుర గీతము లాలపింపుము !
మంజులంబగు పదములన్ ||హృదయవీణా||

# కొండ కోనల నుండి

కొండకోనల నుండి దుముకుచు
బండలను నినదించుచును మఱి
జల్లుగా సెలయేటివలె నే
వెల్లుగా ప్రవహించితిన్ ! ॥కొండకోనల॥

చిట్టి పల్లములందు జరుగుచు
చుట్టు దిరుగుచు సుడులు సుడులుగ!
వంపు సొంపుల యేటివలె నే
నింపు గులికితి ప్రభునికై ! ॥కొండకోనల॥

సన్నసన్నగ జాలు వారుచు
వెన్నగా తెలతెల్ల నౌచును !
వెన్నెలూరెన యేటివలె నే
నెన్నొ రీతుల వేడితిన్ ! ॥కొండకోనల॥

శిలల శిల్పములనుగ మార్చుచు
చిట్టి చేపల నేస్తమై దగ !
పసిడి కాంతుల యేటివలె నే
పంవరించితి విభునికై ! ॥కొండకోనల॥

కలవరించితి! కఱిగిపోతిని!
కాంతుకై సెలయేటి వలె నే
సాక్షి తారలు! సూర్యచంద్రులు!
సఖియ వీణా ! నీవునూ ! ॥కొండకోనల॥

## మ్రోగబోకే :

సీణా! మ్రోగబోకే
హాము దెలుపబోకే !
ఆర్తనాదము
ము ద్రుంచితే ! ||హృదయవీణా||

కే హృదయ తాపము !
పగలై జ్వాల లగుచును!
హము వదిలి వేసితి
యేమున్నవే ! ||హృదయవీణా||

ము ! కాల్వ గట్టకు
ప్రవహింప బోకే !
యింతే ఫలంబని
మట మానితే ! ||హృదయవీణా||

ను వెన్ను జూపను
కమలమునకును !
దును కుహూ కుహూ ధ్వని
చ కమలమున్ ! ||హృదయవీణా||

ము రాలినా ఓగు
కా తీవె లందున?
ని వీడకున్నది
యే మాయయో ! ||హృదయవీణా||

## చల్లని ఓ చందమామా !

చల్లనీ ఓ చందమామా !
జల్లబోకుము! వెలుగు రేకలు ! ॥చల్లనీ॥
ఝల్లుమని నా స్వామి స్మృతులూ
ఉల్లమందున నిలుచునే !

తళుకు బెళుకుల తారలను వెలి
తరలి రాకుము! కాంతు లొలుకుచు! ॥చల్లనీ॥
గోప బాలుని రాస క్రీడలు
కూర్మి గుఱుతుకు దెచ్చునే !

ఏటి యొడ్డున యిసుక తిన్నెల
నీటి జాలుల నీటు గులుకకు ! ॥చల్లనీ॥
మధుర మురళీ నాద స్వరములు
మనసునకు వినిపించునే !

రజిత రేకల రాత్రి యంతయు
రమ్య వర్ణము గురియ బోకుమ ! ॥చల్లనీ॥
మెఱుపువలె నాస్వామి రూపము
మినిమి బంగరు జేయునే !

తూర్పు కొండను తొంగి జూడకు
తోరణములను గట్టబోకుమ ! ॥చల్లనీ॥
మనసు మాధవు రాక యనుకొని
మధుర నాట్యము సేయునే !

## దిక్కులందున దిశల యందున!

దిక్కులందున దిశల యందున
దీనమగు విరహార్తి ధ్వనులును!
మధుర మురళీ గానలోలుని
మంజులంబగు కీర్తనల్! ॥దిక్కులందున॥

నదుల తరగల కలకల ధ్వని
నాదములు సెలయేటి యందున!
విరహ గీతము లాలపించుట
వినబడున్ శ్రుతి మధురమై! ॥దిక్కులందున॥

కోకిలమ్మ పాట, చిలుకల
కూర్మి పలుకుల భావ లహరులు!
నిన్ను బాడుట, నిను స్మరించుట!
చెన్నుగా మది దోచెడిన్! ॥దిక్కులందున॥

సృష్టి యంతయు నిన్ను బిలుచుట
చిత్రముగ గాన్పించు గాదా!
విరహగీతము నాలపించుట
వేయి గొంతులు ఒక్కటై! ॥దిక్కులందున॥

నీదు రాకకు నెదురుజూచుచు
నిలిచియుంటివి ద్వారమందున!
దాసినై నీ సేవ జేయగ
దయను బొందగ శయమునన్! ॥దిక్కులందున॥

## కృష్ణపక్షము వోలె నా మది !

కృష్ణపక్షము వోలె నామది
కష్టములు గలిగింపగా నీ
కిష్టమా ? ఇది నీకు దగునా?
కృష్ణ!విరహిణి నీ నిధన్! ॥కృష్ణపక్షము॥

నిదుర నీరములను త్యజింతి
నిఖిల సుఖముల వదిలి వేసితి !
వీణమీటుచు విమల గీతము
వేయిమారులు పాడితిన్ ॥కృష్ణపక్షము॥

హృదయ వేదన వ్రాసి పత్రము
సదయ నీ కడి యందజేసితి!
ప్రణయలేఖను హంసభామను
పంపితిని గద ! ప్రియతమా! ॥కృష్ణపక్షము॥

పూల మాలను చే ధరించి
పొలుపుగా నీ రాక కొఱకై !
ఎదురు తెన్నులు చూచుచుంటిని!
యెన్నో దినముల నుండియున్! ॥కృష్ణపక్షము॥

శుక్ల పక్షపు చంద్ర కాంతుల.
సోలిపోవుట యెన్నడో గద!
పాద ధూళిని శిరము దాలిచి
పావనంబగు టెన్నదో! ॥కృష్ణపక్షము॥

## విరహ శోకమ! కలకలంబని

విరహ శోకమ! కలకలంబని
వేఁచు బాష్పము లొలుక బోకే!
కదలి తరగల జేరి పొంగును
కదిలి మిన్నును దాకుచున్! ॥విరహ॥

ఉప్పనగు సంద్రపు తరంగము
లొప్ప ఉప్పన నధికమై వే!
సప్త సంద్రము లొక్కటై చను
ఖాలు నిక నీ విరహమున్! ॥విరహ॥

కంటి చుక్కల రాల్ప బోకుమ!
మింట జేరును తారలై తగ!
నింగి నంతను నాక్రమించును
నీటుగా నట మెఱయుచున్! ॥విరహ॥

ఆకు చివురుల యందు నిలుచును
అణిము త్రెము లలరి నట్టుల
పూల తేనెల కలిసి పారును
పొలుపు లొలుకుచు ధరణిపై! ॥విరహ॥

విరహ వేదన మాన్పు మచ్యుత!
చరమ వాంచను దీర్చుమా యిక!
మధుర మురళీ నాదమున నీ
మదిని జేర్పుము స్వనముగా! ॥విరహ॥

## చల్లగాలీ! పిల్లగాలీ!

చల్లగాలీ! పిల్లగాలీ!
మెల్లగా చను! అల్ల నల్లన!
సన్నిధిని నిలుచుండి నాథుకు
విన్నపము నందింపుమా! ॥చల్లగాలీ॥

పూలు కురులను ముడువ దనుమా!
కలువ కన్నుల యందు కాటుక !
సఖియ విడిచిన దనుచు బలుకుము
సరసిజాక్షుని తోడుతన్! ॥చల్లగాలీ॥

నీదు నామములను జపించుచు
నీదు గీతము లాలపించుచు
నిదుర నీరము విడిచె ననుమా!
నీరసించిన దనుచునూ ! "చల్లగాలీ"

చెలువ నిన్నే మదిని దలచుచు
కలువ కాడగ మారె ననుమా!
నింగి జూచుచు నీదు గీతిని
నిర్మలముగా బాడుచున్! "చల్లగాలీ"

రాత్రి దినములు పరిగణింపదు
రమ్యమగు ఋతువులను గాంచదు!
నీదు రాకకు నిలిపి ప్రాణము
నిలిపె ననుచును బలుకుమా ! "చల్లగాలీ॥

నేను:

మురళి నూదే మోహనాంగుడు
ముద్దుకృష్ణుడు ఎచ్చ టెచటే?
మాలతీలత తెలుపవమ్మా!
మాధవుడు యిటు వచ్చెనా?

మాలతీలత :

పొదలచాటున గుబురుమాటున
పూర్ణపురుషుడు నిచట లేడూ!
మావికొమ్మన పాట పాడే
మధుర కోకిల నడుగుమా!

నేను :

కోకిలా! ఓ కోకిలా! విను!
క్రొత్తపాటలు పాడబోకే!
మాధవుడు నీ పాటవినగా
మధురవాణీ! వచ్చెనా?

కోకిల :

విమల స్వరముల నాలపించుచు
వేచియుంటిని యతని కొఱకై!
వన్నెలా శ్రీకృష్ణు జాడలు
వన మయూరిని నడుగుమా!

నేను :

వన మయూరీ! వన మయూరీ!
వన్నెకాడిటు! వచ్చినాడా!
వన్నెలా నీ మధుర నర్తన
చిన్నెలను దిలకింపగా!

వన మయూరి :

రాసక్రీడల రమణు కొఱకై
రమ్యనర్తన జేయు చుంటిని!
కలువ భామను నడిగి జూడుము!
కాంతు డిటు దా వచ్చెనా?

నేను :

కొలకు బందున కులుకు లొలికే
కలువభామా! తెలుపవమ్మా!
చిన్నికృష్ణుడు వచ్చినాడా?
చెలియరో! వినిపింపవే!

కలువభామ :

కోటికాంతుల గోపబాలుడు
కోమలీ! రాలేదు! యిచటికి!
పుష్పవాటిక నుండె నేమో!
పొలుపుగా నీ వడుగుమా!

నేను :

మాలతీలత మధుర కోకిల
కలువ భామను నడిగిజూచితి!
కొలకులను గిరి శిఖరముల నే
కోరి వెదకితి కృష్ణునిన్!

ఎందు వెదకిన కానిపించడు
అందునిందున యిందు వదనుడు!
మనసునందున దాగి కృష్ణుడు
మధుర మురళిని దాచెడిన్!

## చిగురులా వాసంతమును వలె

చిగురులా వాసంతమును వలె
చిత్రముగ భాసిల్లితిని నే!
కోకిలకువలె తీయ తీయని
కోటిగీతులు బాడితిన్! ॥చిగురులా॥

మలయపీఠిక కదులు పూవుల
బొలయు తీగెల వలెను బొంగీ!
మధురగీతము లాలపించీ
మధురిమల నే నొలికితిన్! ॥చిగురులా॥

పూల తేనెలు బుప్పొడులతో
బొలయు వాటిక లట్లుగా నే!
మనసు తీయని భావములతో
మధుర గీతిని బాడితిన్! ॥చిగురులా॥

నోమునోచెడి వాలవలె నతి
నేమమున నిలుచుంటి నే నిదె!
నీదు రాకకు నెదురు జూచుచు
నిర్మలంబగు భక్తితో! ॥చిగురులా॥

మధుర మురళీ నాదములతో
మనసు వీణానాదమై చను!
అమర గీతము లాలపించును
నాత్మపొందును! సుధలతో! ॥చిగురులా॥

## హృదయ వాటిక గ్రీష్మమైనది!

హృదయ వాటిక గ్రీష్మమైనది
సదయ నను కరుణించుమా! వే!
జ్వాలగా నాకసము నంటుచు
భీలగా నే మారితిన్! ॥హృదయవాటిక॥

సుందరము సుకుమారములు నగు
అందములు ఎటు మాయమాయెను!
వేడిగాల్పుల వూలతీవగ
వింతగా నే మారితిన్ ॥హృదయ వాటిక॥

ఆలల తెరలను శూన్యమై నా
అందములు నశియించి పోయెను!
సన్నని సెలయేఱువలె నే
జాలువారితి విరహమున్! ॥హృదయ వాటిక॥

పూచినా పూమొగ్గ విరిసీ
పులకరింపక యున్నరీతిని!
హృదయరాగము మధురగీతిగ
మాధవా! రాకున్నదీ! ॥హృదయ వాటిక॥

పిలిచి పిలిచీ అలసిపోతిని
పొలుపుగా గీతములు పాడుచు!
అలసిపోతిని! సొలసి పోతిని!
ఆత్మనాథా! ఆదుకో! ॥హృదయ వాటిక॥

## వెన్నెలలు పూ మల్లెలకు వలె!

వెన్నెలలు పూ మల్లెలకు వలె
విరియ సాగెను జల్లుగా! చెలి!
వన్నె లెన్నో చిన్నికృష్ణుని
చెన్నుగా విరిసెను మదన్ ! ॥వెన్నెలలు॥

కొలకులందున విరిసె కలువలు
చిలికె కాంతులు నాల్గు దిక్కులం !
రెల్లు పూవుల నిగనిగల్ అదె !
జల్లులాడెడి పుడమినిన్ ! ॥వెన్నెలలు॥

మధుర మురళీ గానలోలుని
మధుర మూరితి మనసు నందున !
విమల గానము సేయ సాగెను
అమల నర్తన సేయుచున్ ! ॥వెన్నెలలు॥

నాలొ నేనే పరవశించుచు
రాసక్రీడల రమణి నొదును !
జన్మ జన్మల స్నేహ గీతము
సఖియ వలె నే పాడుదున్ ! ॥వెన్నెలలు॥

ఆత్మనాత్మను గలుపగా శ్రీ
యఖిలపతి నర్థించు చుందును !
జ్యోతి యందున జ్యోతి గలుపగ
ప్రీతి నే యాచించుదున్ ! ॥వెన్నెలలు॥

# చల్లనీ హేమంత ఋతువున!

చల్లనీ హేమంత ఋతువున
జల్లు హిమ బిందువులకును వలె !
వెల్లువగ కన్నీటి ధారలు !
పెల్లుగా ప్రవహించెగా ! ॥చల్లనీ॥

చిగురు పూవుల యందు నిలిచిన
చిత్రమగు హిమ బిందు సంపద !
మధురమగు అక్షర సుపంక్తుల
మధురిమల వలె దోచెగా! ॥చల్లనీ॥

సుందరంబగు ప్రకృతికి వలె
అందమగు నీ రమ్యరూపము !
కంటి కింపుగ మనసు కింపుగ
కణ్ణ ! మది పులకించెగా ! ॥చల్లనీ॥

నింగిలో తెలిమబ్బు లొప్పుచు
రంగు మీరగ దేలి నట్లుగ !
మనసునందలి భావగీతము
మాధవా! వికసించెడిన్! ॥చల్లనీ॥

సుందరం బీ ఋతువునను నిను
జూడగా నా మనసు కోరిక !
కరుణ జూడు దయను గావుము!
కామితార్థము దీర్పుమా ! ॥చల్లనీ॥

## శిశిరమదె చిగురాకు లొాదిలెను !

శిశిరమిదె! చిగురాకు లొాదిలెను!
చిత్రమగు పూ జల్లు లోయన!
మనసు నందలి కోర్కెలన్నియు
మాధవా! త్యజియించితిన్! ॥శిశిరమదె॥

కోర్కెలన్నియు ద్రోసి దూరము
కోమలంబగు భావములనూ !
మౌన ముద్రను నే వహించితి
మధుర మార్గము వెదకుచున్ ! ॥శిశిరమదె॥

శూన్యమగు ఆకాశమును వలె
శోభలన్నియు బాసి యుంటిని !
కలువ పూవుల కాంతు లుడిగిన
కొలకు వలె నే నుంటినీ ! ॥శిశిరమదె॥

పూలులేని తీవ వలె నే
పొలుపు తరిగీ యుంటి నొంటిగ !
తీగెలన్నియు తెగిన వీణగ
తేజముడిగితి అచ్యుతా ! ॥శిశిరమదె॥

మౌనగీతము పాడుచుంటిని
మాధవా! కరుణింపు వేగము !
గీతి నందలి మధుర భావము
ప్రీతి నీకును దెలియులే ! ॥శిశిరమదె॥

## జన్మజన్మల స్నేహబంధము !

జన్మ జన్మల స్నేహబంధము
జారనీకుము! అచ్యుతా! విను!
హృదయ మందిర మొడలి చనకుము!
సహృదయ! నను మన్నింపుమా! ॥జన్మ జన్మల॥

ఎన్నో పూవుల పూజ జేసితి
ఎన్నో తీయని గీతములతో !
చిన్ని చిన్ని మాటలను నా
విన్నపములను బలికితిన్! ॥జన్మ జన్మల॥

సుందరంబగు శిల్పముగ మది
మందిరంబున భక్తి తోడుత!
అందముగ నే నిలుపుకొంటిని
సుందరా ! నీ మూర్తి నే! ॥జన్మ జన్మల॥

రంగు రంగుల చిత్రముగ నిను
రమణ మనసున వ్రాసికొంటిని!
మధుర కల్పన లెన్నొ గూర్చితి
మాధవా నిను బాడితిన్! ॥జన్మ జన్మల॥

ఆలయం బున్నంత కాలము
అఖిల యేటికను బోవజాలవు!
పాటలన్ను మురిపించెదను నా
మాటలను బంధించెదన్! ॥జన్మ జన్మల॥

కలువ పూవుల కనులదానవు !
కమలముఖివీ! గావలె మఱి ?
అంద చందములందు నీతో
అతివ లెవ్వరు తగుదురే ? ||కలువ పూవు||

కోకిలకు వలె పాట పాడుదు!
కోమలీ! నర్తించు కళనూ!
వనమయూరిని మించిపోదువు !
వన్నెలను చిఱు మల్లెలన్! ||కలువ పూవు||

హంసవలె నలరుదువు నడకల !
చంచలంబగు కంటిచూపుల!
హరిణ కన్యల త్రోసి రాజని
అలరుదువు నందములతో! ||కలువ పూవు||

విరహగీత మదేల బాలా!
వేయి సుగుణము లుండగా నీ
వందమున అప్సరసవవు గద!
ఆత్మ సుందర భావనల్! ||కలువ పూవు||

విభుడు తానే వెదకి కొనుచును
వేగవచ్చును తనకు తానే!
విరహగీతము పాడి నలియకు!
వేయి గొంతుల ధ్వనులతో! ||కలువ పూవు||

హృదయ మది పరిశుద్ధభావము!
మదిని రగులకు! హృదిని చొగలకు !
అల్లనాటి గోపికవు గద!
అలమటించుట యెందుకే ! ॥కలువ పూవుల॥

హృదయమందిర మందు నీ విటు
సదయునీ స్మరియించుకొనుచును
కంటి నీరే కాల్వగట్టితి
మింటి మేఘము పోలికన్! ॥కలువ పూవుల॥

భక్తి తత్త్వము తెలియు నీకును
రక్తితో భగవంతు గొలిచితి!
వచ్చు వఱకును నాగవమ్మా!
మచ్చికను నీ కృష్ణుడున్! ॥కలువ పూవుల॥

## ఒంటిగా వచ్చితిని స్వామీ!

ఒంటిగా వచ్చితిని స్వామీ!
జంట యెవ్వరు లేరుగా మఱి!
అందె గలగల రవళు లైనను
అలరి వినలే దెవ్వరున్! ॥ఒంటిగా

తెల్లనగు నీ వెన్నెలలలో
తెల్లనీ వస్త్రములు దాల్చితి!
మల్లెపూవులు, మంచి గంధము
మాధవా! ధరియించితిన్! ॥ఒంటి

వెనుక ముందులు చూడకుండగ
విపినముల నే నడచి నడచీ
మధురమగు బృందావనమునకు
మాధవా నే వచ్చితిన్! ॥ఒంటి

నీవు తెలిపిన చోటికే నే
నీరజాక్షా! వచ్చి నిలిచితి!
ఇదె కదంబము అదియె పూపొద!
ఇవిగో! మల్లీ మాలతుల్! ॥ఒంటి

మధురమురళీ గానమును విన
మాధవా! యిటు తరలి వచ్చితి!
మనసు నందలి ప్రేమ గీతము
మధురముగ వినిపింపగన్! ॥ఒంటి

## హృదయ మందిరమందు

హృదయ మందిరమందు నీకై
సదయ! ప్రవిమల భక్తితోడుత
వేయి దీపములను జ్వలించితి
వేల కాంతులు నింపుచున్! ॥హృదయ॥

వేయి నామములను స్మరించితి
విమలమగు నీ రూపములనూ!
పంజరములో చిలుకవలె నే
పలికితిని నీ గుణములన్! ॥హృదయ॥

వేయితీగల వీణమీటుచు
వివిధ గీతుల బాడుచుంటిని!
మందిరము ప్రతిధ్వనుల తోడుత
మారు మ్రోగుచు నున్నదీ! ॥హృదయ॥

పలికి పలికీ పిలిచి పిలిచీ
పరవశంబున భక్తి తోడుత !
మూగ వేదన సుడుల ముడులను
మూర్ఛలను నే దేలితిన్! ॥హృదయ॥

వేణునాదము సేయుచును నా
విమలహృదయము బాయకుండుము!
నిలిచియుండుము నెటకుబోకుము
నిలయమగు వట కాత్మలోన్! ॥హృదయ॥

## విరహగీతము నాపుచుంటిని!

విరహగీతము నాపుచుంటిని!
వేయితీగెల పీణయును మఱి!
మౌనప్రార్థన జేయుచుంటిని
మాధవా! కరుణింపుమా! ॥విరహగీత॥

కలువ కన్నెలు కలతజెందెను
గాంచి నా మది విరహవేదన!
పూలు సోనల కాల్వగట్టెను
పుప్పొడుల ధర రాల్చుచున్! ॥విరహగీత॥

కోయిలమ్మదె! మావి కొమ్మను
కుములుచును మదిరోదన ధ్వని
కుహూకుహూయని బాష్పధారల
కోటి ధ్వనులను జేసెడిన్! ॥విరహగీత॥

తుమ్మెదలు పెనురొదలు జేయుచు
ఝుమ్ము మని నా శోకగీతము
పూవు పూవున కందజేయుచు
పొలయుచున్నవి! వేదనన్! ॥విరహగీత॥

పంచభూతము లదురు చున్నవి
గాంచి నా మది విరహ జ్వాలము
హంస హంసను జేరవలె నను
నాశ దెలుపుచు నున్నవీ! ॥విరహగీత॥

## పచ్చని ఓ చిలుకలారా!

పచ్చనీ ఓ చిలుకలారా!
పయనమై నా నాథు కడకున్
పత్ర మిదె! నందింపుడమ్మా!
ప్రార్థనను మన్నింపుడో! ॥పచ్చనీ ఓ॥

కొండ కోనల నడవులన్నీ
నిండు నదులును దాటిపొండో!
పంకజాక్షుని జాడ తెలిసీ
పత్రమును నందింపుడో! ॥పచ్చనీ ఓ॥

నాథు కనుగొని జాగు సేయక
నాదు వేదన శోక మంతయు!
ఉన్నదున్నటు విన్నవింపుడు
సన్నజాజుల మాలగన్! ॥పచ్చనీ ఓ॥

అఖిలపతివీ! ఆత్మనాథుడు;
అంత మాత్రము నీకు తెలియద?
సఖియ విరహము దీర్చుమాయని
సరసముగ వినిపింపుడో! ॥పచ్చనీ ఓ॥

తిరిగి వచ్చిన వెంటనే నే
తెలుగు తోటల ఫలములన్నీ
విందు జేయుదు నమ్మలారా!
అందుకొనుడీ! పత్రమున్! ॥పచ్చనీ ఓ॥

## విరహగీతమ! విడిచిపోకుము!

విరహగీతమ! విడిచిపోకుము!
విభుని జేరెడి నంతవఱకును!
మాధవుని కృప గలుగు నంతకు
మధుర పదముల నొలుకుమా! ॥విరహగీతము॥

తారలకువలె తళుకు బెళుకుల
తరలుమా! నా హృదయ వీధిని!
కోమలంబగు మధురస్వనముల
కోకిలకు వలె బాడుమా! ॥విరహగీతము॥

నిండు చందురు కిరణములవలె
పండి నూతన భావములతో!
తీయ తీయని మధురపదముల
దీర్చుమా! నవగీతమున్ ॥విరహగీతము॥

మధురగీతమ నీవు లేనిది
మాధవుని యెటు పిలుతునే సఖి?
ఆత్మనాధున కెటుల దెలుపుదు?
అలరు మనసున భావముల్! ॥విరహగీతము॥

వేయి కాంతుల దీపమట్లుగ
సాయముగ నా కలరి యుండుము!
హరిని! జేర్పగ! పతిని గూర్పగ!
ఆత్మ సఖివై మెఱగుమా! ॥విరహగీతము॥

## క్కలారా! దారి విడువుడు!

చుక్కలారా! దారి విడువుడు!
చక్కనీ నా స్వామి దారికి!
చందమామా! అర్చనల నిడు
చారు సుందర జ్యోత్స్నలన్! ॥చుక్కలారా॥

గిరులు! స్వామికి మెట్లు గట్టుడు!
విరులు జల్లుడు ప్రీతితోడను!
మణులతో మాణిక్యములతో
మాధవుని బూజింప్రడో! ॥చుక్కలారా॥

పుడమి తల్లీ! పుణ్యవతివే!
భూరి భాగ్యము నీదె గాదా!
స్వామి చరణము లుంచు నీపై
సరసిజాక్షిరా! ధన్యవే! ॥చుక్కలారా॥

పూలతీగెలు పుప్పొడులతో
రాల తేనెల అమృతధారలు!
మాధవున కిదె స్వాగతంబని
మధుర గీతము బాడుడో! ॥చుక్కలారా॥

మంగళంబని నేను బాడగ
మధురమూర్తికి జయము జయమని!
అలరి నను తన హృదిని జేర్చును
అమృత దృష్టిని బఱపుచున్! ॥చుక్కలారా॥

## రాజహంసా రమణుతో!

రాజహంసా! రమణుతో నా
రగులు విరహము దెలుపుమమ్మా!
నిన్ను దలచుచు నున్నదనుమా!
నిర్మలంబగు భక్తితో! ॥రాజహంసా॥

ఇహపరంబుల యిచ్చ కంటెను
ఈశ్వరా! నిను కలియగోరుచు!
ఆలపించుచు! నున్న దనుమా
అమల స్వరముల గీతమున్! ॥రాజహంసా॥

వేయి తీగెల వీణ మీటుచు
విమల గాంధర్వంబు నందున!
నిన్ను బాడుచు నున్నదనుమా!
విన్నవింపుము ప్రార్థనన్ ! ॥రాజహంసా॥

కడలిలో బడబాగ్ని ! వలె దా
కనలుచున్నది యనుచు దెల్పుము !
నీరు విడిచిన మీనురీతిని
నీరసించిన తనుచునూ ! ॥రాజహంసా॥

మనసు గలుగగ మాదురీగతి
మాధవున కిది దెలియ బలుకుము !
విరహవేదన విప్పిజెప్పుము
వేయి విధముల స్వామికిన్ ! ॥రాజహంసా॥

## హృదయగీతిక ! చిన్నబోవకు !

హృదయ గీతిక ! చిన్నబోవకు !
సదయు దయ రాలేదటంచును!
వేయి పక్షాలు గాకుమా ! యా
మిధుని కృప రాలేదనీ! ॥హృదయ॥

మధుర పదముల మధుర స్వనముల
మాధవుని దయ గోరి పిలిచితిని!
కైశికీ రాగముల తోడుత
కమ్మగా పాడితివిగా! ॥హృదయ॥

నింగి చుక్కలవోలె చెదరకు!
నిష్ఠురంబగు వేద నొందకు!
పూలమాలగ పులకరింపుము
పూర్ణచంద్రుని వడుపునన్ ! ॥హృదయ॥

నేల రాలిన పూలవలె నీ
వేల మోమును త్రిప్పెదో యటు!
మధు వసంతము మళ్లె తీవగ
మధురిమల కుసుమింపుమా! ॥హృదయ॥

దివ్యమగు నీ దీర్ఘయాత్రను
దీనతను విడనాడి ముందుకు!
ధీరతను సుజ్ఞానమున నీ
దిశకు వే పయనింపుమా! ॥హృదయ॥

## విరహ బాష్పమ! నేలరాలకు!

విరహ బాష్పమ! నేలరాలకు!
వెతను తెంపకు! కంత తోడుత!
మారవేశము నున్న పరిపై
నోవ సూరోచింపరా! ॥విరహ॥

కాకితో కబురంపె గాదా!
కలికి! వచ్చె నీ యువ మనమున
చిలుకతో నిడె పత్రమునకు
వెలియు! తాళ మురుంపుమా! ॥విరహ॥

మేఘమాలికు చెప్పి పంపెను!
మేఘిచే వచ్చెద మటంచును!
చందమామయు చెప్పెగాదా!
సరసిజాక్షుని రేఖమా! ॥విరహ॥

నిన్న మొన్నటి బంధమా! యిది?
ఎన్ని నాళ్ళది స్నేహ మధురము!
విడని ముడి యిది జన్మజన్మల
వీడిపోవని నేస్తమా! ॥విరహ॥

కన్నులా కాటుకల చెంతను
కడిగివేయకు విరహ బాష్పమ!
మంచిముత్యము నీవు వెలుగుము!
మధురముగ తన చిన్నెపై! ॥విరహ॥

# కంటిసీరా! కాల్వగట్టుము!

కంటిసీరా! కాల్వగట్టుము!
కథ సమాప్తిని! పొందు వఱకును
విరహమా! నీ వాగబోకుము!
ఏమసికై తపియించుమన్! ॥కంటిసీరా॥

మధుర భావము! మాటుమణగకు
మా యపై యెట్లె దూరము పంచున !
విరహగీతము! ఆగబోకుము?
వేయిపదముల పాడుదిన్! ॥కంటిసీరా॥

తీయనీ ఓ కంఠమా! నీ
తీపి పాటను నాపబోకుము!
అధరమా! అచ్యుతని నామము
నాలపించుట మానకుమా! ॥కంటిసీరా॥

శోకమా! సడివడక యుండుము !
సోలి యలసట జెందబోకుము!
స్వామికై మది కలతజెందీ
సఖియవలె విలపించుటల్! ॥కంటిసీరా॥

జ్యోతి జ్యోతిని కలిపినప్పుడే
రాత్రి పూర్తి యగునుగాదా!
కథ సమాప్తము జెందువఱకును
కాల్వగా ప్రవహింపుమా! ॥కంటిసీరా॥

## చిలుకలారా ! ఆపుడాపుడు !

చిలుకలారా! ఆపు డాపుడు !
చిత్రమగు మీ పలుకులను వే!
మధురమగు నా భక్తిగీతము
మాధవుడు వినునంతకున్ ! ॥చిలుకలారా॥

కోకిలా! ఒక క్షణము నాపుము
కుహూ కుహూ మను గీతములనూ!
వనమయూరీ! నిముస మాపుము
వన్నె లొలికెడి నర్తనల్! ॥చిలుకలారా॥

కల కలా ధ్వని సేయబోకుడు !
అలల తెరలను తూలబోకుడు !
తీయనీ నదులార వినుడో!
తీరుగా నా ప్రార్థనల్! ॥చిలుకలారా॥

తుమ్మెదా రొద సేయ బోకుము !
తూలి నాట్యము సేయబోకుము !
నీటి పక్షులు! గోల నాపుడు!
ఏటికమ్మా తగవులా? ॥చిలుకలారా॥

పాడుచుంటిని ప్రణయ గీతము
పతిని గలియగ భక్తి గీతము
పాట పూర్తిగ పాడువఱకును
పతతులారా ! యాగుడో ! ॥చిలుకలారా॥

## రంగు రంగుల పూలతీవలు

రంగు రంగుల పూల తీవలు
రమణ! దారిని నిలిచినను నే
చెంగు చెంగున జేరవచ్చితి
చెన్నుగా నీ భక్తితోన్ ! ॥రంగురంగుల॥

వన్నె వన్నెల సంధ్య కాంతులు
చిన్నెలని బంధింపగా నను!
ఉన్నమాటను జెప్పి వచ్చితి
కణ్ణ! నీ దానను అనీ ! ॥రంగురంగుల॥

ఇంద్ర ధనుసుల సప్త వర్ణము
లింపుగా నను జేర బిలువగ !
వల్లగాదని? మళ్ళి రమ్మని
వెళ్ళి వచ్చితి రయమునన్ ! ॥రంగురంగుల॥

రంగు రంగుల పికిలి పిట్టలు
రంగు రంగుల కలువ భామలు !
పిలువగా నే పలుకు పలుకక
ప్రియతమా ! నిటు వచ్చితిన్ ! ॥రంగురంగుల॥

జన్మ జన్మల సఖిని గాదా !
విన్న వింపగ నేల స్వామీ !
ఆటలను అనాడు పాడిన
పాటలను స్మరియింపుమా ! ॥రంగురంగుల॥

# పచ్చని ఓ తరువులారా !

పచ్చని ఓ తరువులారా !
అచ్చమైనా భక్తి తోడుత !
పచ్చని తోరణము గట్టుడు!
పరవశించుచు స్వామికిన్ ! ॥పచ్చని॥

కొండ కోనల కోటి తరువులు
మెండు శోభల చింది యూగుచు !
అందముగ జాజులను దీర్చి
అలపదమ్మా పూవులన్ ! ॥పచ్చని॥

పల్లవి నీడలను పందిరి
చిలుకలారా ! గూర్చుడమ్మా !
రంగువల్లుల దిద్దుడమ్మా
రమణునకు వే పుప్పొడిన్ ! ॥పచ్చని॥

ఫల రసంబులు ప్రీతి తోడుత
ప్రభున కర్పణ సేయుడమ్మా !
పిల్లగాలుల వీచుడమ్మా !
ఉల్లసిల్లుచు చిగురులన్ ! ॥పచ్చని॥

అదిగో! అడుగో! ఆత్మనాధుడు
అఖిలపతి! అద్యంత రహితుడు !
పచ్చని ఆకులు, పూలు, ఫలముల
తెచ్చి గొల్వుడు భక్తితోన్! ॥పచ్చని॥

## మఱల మఱలను గ్రుచ్చి యడుగకు!

మఱలి మఱలను గ్రుచ్చి యడుగకు
మాధవీ! నా హృదయ మందున
మాధవునిపై ప్రేమ గలదని
మఱలి మఱలను దెలుపనా ? ॥మఱలి॥

అడుగ బోకే భ్రమరమా ! నా
అచ్యుతునిపై మధుర ప్రేమను !
జన్మ జన్మల స్నేహ బంధము
మర్మములు వివరింపనా ? ॥మఱలి॥

నీలి మేఘమ! నిలిచి యడుగకు
జాలిగా నను జూడబోకుము !
నీలవర్ణుని పైని విరహము
నిత్యమని దెలిపితి గదా ! ॥మఱలి॥

చందమామా! స్వామిపై గల
చందములు నీ వెఱుగ లేవా?
తాళి గట్టిన పతియనీ, నా
సర్వ మతదని తెలియదా ? ॥మఱలి॥

పంచభూతములార ! వినుడో !!
వంచనను నను జేయబోకుడు !
అఖిలపతి నాయాత్మ పతియని
యెఱచి పలుకుచు నుంటిని ! ॥మఱలి॥

# విరహ శోకమ ! వేగ మ్రోగకు !

విరహ శోకమ! వేగ మ్రోగకు!
నిమిసికై తపియింప మంటిని!
పంతమందే నిలిచి యుండుమ!
కాంతుని దరి హొందగన్! ॥విరహశోకమ॥

అందెవలె ఘల ఘల్లు ఘల్లున
అలికి రవళుల సేయబోకుము!
హంస గమనము వోలె మెల్లన
మెలరుమా! సుకుమారతన్ ! ॥విరహశోకమ॥

కోకిలకువలె కొండ కోనలు
కుహు కుహూ యని పాట పాడకు!
పొదలలో గోరింక పలికెడి
పొదల ననువర్తింపుమా! ॥విరహశోకమ॥

వనధి వలె పెనుమ్రోత మ్రోగకు
కనలి పోకుము! ధ్వనుల తోడన!
ఏటి మ్రోతల తీపివలె నీ
మాట పాటల వెలువుమా! ॥విరహశోకమ॥

మల్లె పూవుగ మధువు లొలుకుచు [illegible]!
కలువగా నవ కాంతు లీనుము!
మధురముగు నీ బాధ దెలుపుము
మాధవుని మది [illegible]! ॥విరహశోకమ॥

# మురళి నూదుచు ముద్దు ముద్దుగ

మురళి నూదుచు ముద్దు ముద్దుగ
మోహా జలధిని ముంచ బోకుమ!
మధుర నర్తన సేయబోకుము
మాధవా! నా మనసునన్! ॥మురళి॥

నెమలి పింఛము కదులుచుండగ
సిటు గుబాళము నందములతో!
రాసక్రీడల నాడ బోకుము
రమణి! నా హృద్వీధిలో! ॥మురళి॥

యమున యొడ్డున మురళీ నూదుచు
నాలమందల గాచుచును మరి
గోపబాలుర తోడ గూడిన
కూర్మి దృశ్యము జ్ఞాపకమా! ॥మురళి॥

అమ్మ వెన్నా! అనుచు కవ్వము
అదిమి పట్టెడి మధుర దృశ్యము
అల యశోదకు భువన భాండము
నలరి జూపెడి దృశ్యమున్ ॥మురళి॥

మనసు చిన్నది! వలపు చిన్నది!
మధుర గీతిక చిన్నదైనది!
మనస్సు నందలి వాంఛ గొప్పది
మాధవా! యెటు దీరునో! ॥మురళి॥

## ఆవలొడ్డున యచ్యుతుడు

ఆవలొడ్డున యచ్యుతుడు గల
వందుకో వలె! చెలియరో! మఱి
అలల తెరలా యేటి సుందరి!
యడ్డు రాకుము! సుడులతో! ॥ఆవలొడ్డున

పుష్ప వాటిక దాటి వచ్చితి
పూర్ణ పురుషుని జాడ వెదుకుచు!
మిట్ట పల్లము లన్ని దాటితి
కష్టమేమియు లేకయున్! ॥ఆవలొడ్డున

పూల తేనెల వాకలన్నియు
పుష్పొడుల పెను రాశులన్నియు!
పొదలు గుబురులు ఆకు తీవలు
పొలుపు గులుకును దాటితిన్! ॥ఆవలొడ్డున

పూల పడవను దరిని జేర్చుము!
పూర్ణ పురుషుని జేర జను నను!
సుడులతో నను అడ్డు దగులకు
మడుగులను వేధింపకే ! ॥ఆవలొడ్డున

పచ్చనీ మైదానములనూ
వసిమి వన్నెల కోన లన్నియు
కలువ కన్నెలు కులుకు కొలకుల
కాంత! దాటితు వచ్చితిన్ ! ॥ఆవలొడ్డున

# చిన్ని పాటల చిన్నిమాటల !

చిన్ని పాటల చిన్ని మాటల
జేర్చి బాడుచు నుంటినీ ప్రభు!
అందుకే నీకింత కోపమ?
ఆగ్రహింపకు దాసినీ! ॥చిన్నిపాటల॥

అఖిల భువనము లన్ని బ్రోచెడి
యాదరించెడి యఖిల పతినీ !
చిన్ని మనసున కెట్లు వచ్చితి
వన్నెలను నొలికించుచున్ ! ॥చిన్నిపాటల॥

వేద వేద్యుడ వఖిల శాస్త్రము
లాది మొదలును నీవె గాదా!
చిన్ని మాటల నెట్లు నిమిడితొ
చిన్ని పాటల హద్దులన్! ॥చిన్నిపాటల॥

చిన్ని పాటల, చిన్ని మాటల
చిన్ని పాపల మనసు లందున !
ఎన్ని చిత్రములుండునో నా
కణ్ణ! నీకిది తెలియదా? ॥చిన్నిపాటల॥

మల్లె పూవును చిన్నదీ! నా
మధుర గీతిక చిన్నదైనది!
వెన్నుడా! నీ కర్పితం బిది!
విన్నవించితి భక్తితోన్ ! ॥చిన్నిపాటల॥

## మధుమతీ! నన్నావబోకుము!

మధుమతీ! నన్నాపబోకుము
మదిని విరహము తొణక నీవే!
మాటలేలనె? పాటలేలనె?
మంచిగంధము పూతలున్? ॥మధుమతీ॥

చిగురుటాకుల శయ్యలేలనె?
చిత్రమగు పూరేక లేలనె?
చంద్రకాంతుల రసములేలనె?
చారుసుందర లేపనల్? ॥మధుమతీ॥

తామరాకుల చల్ల గాలుల
తరుణి! విసరుట మానవమ్మా!
మల్లెపూవుల తూగు టుయ్యేలి
మానినీ! నన్నాపకే! ॥మధుమతీ॥

పరిమళపు పన్నీటి జల్లుల
పడతి! నను వేధింపబోకుము!
విభుని విరహము నధిక మాయెను
వేదనలు కడు ప్రబలెనే! ॥మధుమతీ॥

వెంట నుండక వెడలి పోవమ్మా!
ఒంటిగా నను పొగలనిమ్మా!
ఒంటిపాపగ నేడ్వనిమ్మా!
సఖుడు నన్నోదార్చునో ॥మధుమతీ

## శబరిగా నే దారి గాచితి !

శబరిగా నే దారి గాచితి
సరసిజాక్షుని రాకకొఱకై !
మధుర పదముల మాలగ్రుచ్చి
మంజులంబగు గీతితో ॥శబరిగా॥

వన్నెలా పూవులను దెచ్చితి
చిన్నెలా పూ వాటికలలో !
స్వర్ణకమలము లేరి దెచ్చితి
చారు సుందర సరసులన్ ! ॥శబరిగా॥

వెన్న, మీగడ, పాలు, పెరుగులు
వేడ్క హృదయము నందు నుంచితి !
శ్రద్ధ పఱచితి పతితపావను
పావనంబగు రాకకై ! ॥శబరిగా॥

మనసు నందలి మధువు నంతను
మధుర భాండము నందు నెత్తితి !
మంగళంబని యాత్మ జ్యోతిని
రంగుమీరగ బాడుచున్ ! ॥శబరిగా॥

వేచియుంటిని యింటి ముంగిట
వేయి కన్నుల జూచుచుంటిని !
ఆత్మనాధుని పూజ సేయగ
ప్రీతిపాత్రుని గలియగా ! ॥శబరిగా॥

# కనులలోనే నిలిచియుందువ?

కనులలోనే నిలిచియుందువ?
కనులకును కనిపింపవా మఱి?
ఏల స్వామీ ! యిట్టి నటనలు !
చాలు ! చాలిక సరసతా ! ॥కనులలోనే॥

పాటలను పన్నీటి జల్లుల
పరవశించుచు నుందు వెపుడును !
మాటలను భాసించు చుందువు
మధువులను నొలికించుచున్ ! ॥కనులలోనే॥

ఆటలను వలరారు చుందువు
అఖిల! నృత్యము సేయుచుందువు !
అధరమందున మురళి నూదుచు
అమృత గానము సేయుచున్ ! ॥కనులలోనే॥

ఎన్ని జన్మల పుణ్యఫలమో
కణ్ణ ! నిను స్మరియించు టిట్టుల !
అమృతమై ఆనంద డోలల
ఆనవరతమును నూగుటల్ ! ॥కనులలోనే॥

కనులలోనే యుందు మట్టుల
కలలలో కనిపించు చుండుము !
మధుర మురళిని మ్రోయుచుండుము
మాధవా ! కరుణింపుచున్ ! ॥కనులలోనే॥

## ఎన్ని జన్మము లిటులెరానీ !

ఎన్ని జన్మము లిటులె రానీ !
ఎన్ని యుగములు నిటులె పోనీ !
కన్న ! నీ పదభక్తి ! మదిలో
గారవింపుచు నుండనీ ! ॥ఎన్ని॥

ఆశలందున దొరలనిమ్ము ! ని
రాశ లందున వేగనిమ్మా !
అధరమందున నీదు గీతము
నాలపించుచు నుండనీ ! ॥ఎన్ని॥

కంటిధారలు పొరలి పోనీ !
కాంక్ష వేవో కలుగి పోనీ !
అంతరంగము నిన్ను జూచుచు
నాత్మ సౌఖ్యము నొందనీ ! ॥ఎన్ని॥

మోక్షమును నిను గోరబోనూ !
మోహమొందను సుఖము లందున !
భక్తి బాంధవ్యమును నడుపుచు
రక్తిలో నను దేలనీ ! ॥ఎన్ని॥

నీదు మురళీ గానమందున
నాదు గీతము గలియనిమ్మా !
భక్తిలో నే మునిగి దేలుచు
బరవసించుచు నుండనీ! ॥ఎన్ని॥

## చుక్కలెన్నో యాకసంబున

చుక్కలెన్నో యాకసంబున
చూడ జోద్యం బౌను గానీ !
మక్కువగ నా చందమామయె
మనసు కింపగు చిత్రమూ! ॥చుక్కలెన్నో॥

చిగురులెన్నో పూవులెన్నో
చిత్రమౌ వాసంత మందున!
మనసు కింపగు మల్లిపూవే
మాధవా! నా కిష్టమూ ! ॥చుక్కలెన్నో॥

పాటలెన్నో పాడుకున్నా
పదములెన్నో పలికినా నీ
ముద్దు లొలికెడి మురళి గానమె
మోదమున దేలించుగా ! ॥చుక్కలెన్నో॥

రసము లెన్నో తొణుకులాడిన
దమ్యభావము లెన్ని దోచిన !
కరుణ రసమున కఱగిపోవగ
కాంక్ష మది తపియించునూ ! ॥చుక్కలెన్నో॥

ఎన్ని బంధము లున్న జగతిని
ఎందఱున్నను బంధు మిత్రులు!
కన్న! నీవే గతివి పతివని
కాంక్ష సేయుదు నిరతమున్! ॥చుక్కలెన్నో॥

## కాఱుమబ్బులు కఱిగి పోయెను

కాఱుమబ్బులు కఱిగి పోయెను
కాంతి రేఖలు తొంగి జూచెను !
ఈశరదృతు వందు నైనా
యింపుగా! కనిపింతువా? ॥కాఱుమబ్బులు॥

నీలిమబ్బులు నింగి నిండిన
నిశలు నీకై యెదురు జూచితి!
ఉఱుములకు వలె నఱపు లఱచీ
మెఱపులకు వలె బిలిచితిన్ ! ॥కాఱుమబ్బులు॥

నదులు వాగులు పొంగునట్లుగ
నాదు కనులను బాష్పధారలు !
అలల తెరలను బరుగులెత్తీ
యంబుధిని బడి నురుగులన్! ॥కాఱుమబ్బులు॥

తెల్లనీ వెన్నెలల తోడుత
చల్లనీ చిఱుగాలి తెరలను !
రంగురంగుల పూలు పిరిసీ
రమణి ప్రకృతి బాసిలెన్! ॥కాఱుమబ్బులు॥

రమ్ము రమ్మిక నాలసింపకు !
రమ్యమౌ శర దాగమంబున !
తీయనీ నీ మురళి రవముల
ధీరుగా వినిపింపుమా ! ॥కాఱుమబ్బులు॥

## గోపికనురా! కోటి జన్మల

గోపికనురా ! కోటి జన్మల
కోరి నిన్నే పాడుచుంటిని !
మాసిపోనీ, మఱపు రానీ
మధుర గీతము నాదిరా ! ॥గోపికనురా॥

సుందరము సుకుమారమై నా
అందమౌ నా హృదయమందున !
మధుర భావము వెలువరించిన
మంజులంబగు గీతరా ! ॥గోపికనురా॥

ఆత్మ జ్యోతిని వెల్లివిరిసీ
అఖిల ప్రకృతి నావరించీ !
ఆగిపోనీ మధుర నాదము !
అమర గీతము నాదిరా ! ॥గోపికనురా॥

గీత మెందుకు బయలు వెడలెనో
గీతి లోపల భావ మేమో !
నీకు నాకే తెలియురా మఱి
నీదుమోహన మురళికిన్ !

ఆగిపోవదు నాదు గీతము
అంత మొందదు నాదు రాగము !
జన్మజన్మలు సాగిపోనీ !
జనన మరణము లందునన్ ॥గోపికనురా॥

## అలల తెరలను నాటుపోటుల

అలల తెరలను నాటుపోటుల
యంబుధికివలె నలత గూర్పకు !
చిన్నికొలనును ! చిద్విలాసా !
చింతలను నను దేల్పకుమా ! ॥అలల॥

మీను కదలిన మేను కదలును !
హంస యాడిన యలల రేగుడు !
నీటిపక్షుల కలకలములను
నిలుపలేనుర ! శాంతమున్ ! ॥అలల॥

చిగురుపూవుల చెట్ల నీడలు
చిన్నితీగెల యాట పాటలు !
అందముగ నాలోన జూచుచు
నలరుదును ! ఆనందమున్ ! ॥అలల॥

నింగిచుక్కలు తొంగి చూచును !
నీలిమబ్బులు పరువులెత్తును !
చందురూనీ సొబగులన్నీ
జారు నాపై తెల్లనై! ॥అలల॥

నీదు రాకకు విరహిణికి వలె
నింగిజూచుచు నలల కదలక
వేడుచుంటిని ! విమలహృదయా !
వేడుకా? యిటు సేయుటల్ ! ॥అలల॥

# మనసునందలి మధుర భావము

మనసునందలి మధుర భావము
మాటలను నే తెలుపవలెనా ?
ప్రణయగీతి భావమును నే
పాటపాడి తెలుపవలెనా ? ||మనసు||

అందె ఘల్లున మ్రోవగా నే
నాటలాడి తెలుపవలెనా ?
భక్తితో నంజలి ఘటించుట
భావమేమో తెలియదా ? ||మన||

నిదుర నీరములన్ని మాని
నీరసించుట తెలుప వలెనా ?
దిశలు జూచుట వ్యథల మూర్ఛలి
దేలిపోవుట తెలియదా? ||మను||

మలిన వస్త్రము దాల్చు టెందుకో ?
మాధవా ! యని పిలుచు టెందుకో?
కంటినీరము కాల్వ యగుటను,
కలకల ధ్వని తెలియదా ? ||మను||

మధుర మురళీ నాదమున నా
మనసు జేర్చగ కాంక్షరా మతి !
కోటి జన్మల కాంక్ష యిదియే
కోమలాంగా ! తెలియదా ? ||మను||

# చిగురు నైనా పూవు నైనా

చిగురునైనా పూవునైనా
చిన్ని యాకుల రెమ్మనైనా
మాధవా! నీ సేవ కొఱకై
మధురముగ నను జేకొనూ! ॥చిగురునై॥

ఎఱుపు నైనా తెలుపునైనా
ఎట్టిరంగున వెలసినా నను
ఇంద్రధనుసున జేర్చుమా నను
చింపులొలికెడి రంగులన్ ॥చిగురునై॥

ఎట్టి దారుల నడిచినా నను
ఎన్ని బాటల వెదలినా నీ
మంచిదారిని మంచిదారిని
గమ్యంచితంబుగ జేర్చుమా! ॥చిగురునై॥

ఎన్ని జన్మలు పొందినను మఱి
యెన్ని పుట్టువు లందినా సరి
నిన్ను మఱువక యుండునట్టుల
నెమ్మదిని మది సేయుమా! ॥చిగురునై॥

చిలుకవలె నీపలుకు పలుకుదు!
చిత్రముగ కోకిలగ పాడుదు!
పికిలిపిట్టగ జేసినను నే
ప్రీతి బలుకుదు నామమున్! ॥చిగురునై॥

## ఉంటివో లేకుంటివో! మజి

ఉంటివో! లేకుంటివో మఱ
యెట్టివాడవో! యెట్టి మనసో!
ఉంటివని నిన్నంటి యుంటిని!
అన్నిరూపులు నీవనీ! ॥ఉంటివో॥

కల్లకాదని కలలు కావని
కాంతుడవు! నా గతివి! పతివని!
నిన్ను జూడకనే వరించితి!
నిర్మలంబగు మనసుతో! ॥ఉంటివో॥

మనసు నిచ్చితి మాట నిచ్చితి
మనసు మర్మము లన్ని దెలిపితి!
పాటపాడుచు నుంటినీ! నీ
పజ్జ జేరగ నిమ్మనీ! ॥ఉంటినో॥

క్షణము నే జీవింప జాలను!
వినయముగ నీ గీతి బాడక!
అటకెటివి నాహృదయ మందున
యిష్టుకొనలే రెవ్వరున్! ॥ఉంటివో॥

వంగి చూడవు! తూలియాడవు!
తోరముగ నొక పలుకు బలుకవు!
అందముగ నను హృదిని జేర్చి
యాదరింపవు! చిత్రమూ! ॥ఉంటివో॥

## నిర్మలోదక! నిఖిల బాంధవ!

నిర్మలోదక! నిఖిల బాంధవ!
నిలిచి నా పలు కాలకింపుము!
మనసు నందలి విరహ వేదన!
మాధవున కెఱిగింపుమా! ॥నిర్మలోదక॥

పతి వియోగముచేత కుమిలెడి
సతిని నేను అభాగ్యజీవిని!
విభుని జేరగ మదిని గోరుచు
విలవిలా విలపించు సుదతిని! ॥నిర్మలోదక॥

పరమ పురుషులు సాధుజను లిల
పరుల మేలుకు పాటు బడుదురు!
నిలిచి నా వేదనల జెవి నిడి
నిండు కరుణను గారవింపుము! ॥నిర్మలోదక॥

మనసు పొరలను మాటు మణిగిన
మర్మముల నే విశదబఱచెద!
మదిని నను సోదరిగ జూడుము!
మధురభావము మమత బొంగగ! ॥నిర్మలోదక॥

జన్మ జన్మల ప్రేమబంధము
జాలువారిన వలపు గీతిని!
మెల్లగా నే విన్నవించెద!
చల్లగా నా పతికి దెలుపుము! ॥నిర్మలోదక॥

## సర్వజీవుల కార్తి బాపెడి

సర్వజీవుల కార్తి బాపెడి
సరస సద్గుణ! నీలజలధర!
కామితార్థ ప్రదుండ వందురు
కాంతు స్నేహము గలుగజేయుము! ॥సర్వజీవుల॥

మార్గమున గనిపించు నెన్నో
మధుర దృశ్యము లింపు సొంపులు
కొండకోనలు లోయ లడవులు
కొల్లలుగ సెలయేటి ధారలు! ॥సర్వజీవుల॥

నిన్నుగాంచిన వన మయూరము
నీటుగా నృత్యమును సేయును!
పికిలిపిట్టలు స్వాగతం బని!
ప్రేమ మీరగ ధ్వనులు సేయును! ॥సర్వజీవుల॥

వానకోయిల పాట బాడుచు
కానలన్ని ప్రతిధ్వనించును!
చిలుక చెలువలు చిట్టి పలుకుల
చేరి కుశలము లడుగుచుండును! ॥సర్వజీవుల॥

తెల్లనీ పూమల్లె దండగ
యుల్లి మలరగ క్రౌంచపక్షులు!
కన్నులకు బహు విందొనర్చును
గాంచి ముందుకు సాగుమోయీ! ॥సర్వజీవుల॥

## అఖిల జీవుల కార్తి బాపుమ

అఖిల జీవుల కార్తి బాపుచు
నాదరించే ప్రాణదాతవు!
ఆర్తురాలిని అన్న యంటిని!
ఆదరింపుము! జలధరా! ॥అఖిల జీవుల॥

దూర దేశమునందు నా పతి
తీరముగ వసియించు చుండును!
నీలమేఘ శ్యామ వర్ణుడు!
నీటు గులికెడి మోమువాడూ! ॥అఖిల జీవుల॥

నెమలి పింఛము దాల్చి శిరమున
నీటుగా గోపికల తోడుత!
రాసక్రీడల దేలుచుండును
రంగు మీరగ మురళి నూదుచు! ॥అఖిల జీవుల॥

ఆత్మనాధుడు అతని కోసమె
యార్తనై విలపించు చుంటిని!
కన్నులను దా నిలిచి యుందును
కదిలి చనడొక నిముసమున్! ॥అఖిల జీవుల

మెల్లగా వినిపించి నా కథ
చల్లగా నాపతిని గూర్చుము!
తీయతీయని తెలుగు బలుకుల
తేటగా వినిపింపు స్వామికి! ॥అఖిల జీవుల॥

## ఆత్మవిభుడు వసించు చోటులు!

ఆత్మవిభుడు వసించు చోటులు
నలరి జలధర! యాలకింపుము!
ఆది మధ్యాంతముల స్థిరుడై
యణగియుండును నణువు నణువున! ॥ఆత్మవిభుడు॥

భూమి యాకాశములు గలిసెడి
హొలుపు గులికెడి తావులందున!
ఉభయ సంధ్యల కాంతులందున
అభయ హస్తముతోని నిలుచును! ॥ఆత్మవిభుడు॥

సూర్యచంద్రులు తారకలలో
సుందరంబగు తావు లందున!
కోటి సుందర ప్రభలతోనీ
కూడి యుండును నిర్మలముగా! ॥ఆత్మవిభుడు॥

పరంజ్యోతిగ పరమ పురుషుడు
పతిత పావనుడై వెలుంగును!
ఆర్తులను రక్షించు కొఱకై
అన్ని రూపములను ధరించును! ॥ఆత్మవిభుడు॥

చిన్ని కృష్ణుని రూపుదాల్చిన
వన్నెకానిని! చిద్విలాసుని!
అందములపై వలపు గొంటిని!
అతడె నావిభు! పతని! సతినీ! ॥ఆత్మవిభుడు॥

అందమగు నాషాడ జలధర!
సుందరుని నా పతిని గూర్పుము!
పొంగినా నా హృదయగీతిని
రంగు మీరగ పతికి జేర్పుము! ॥అందమగు॥

పలికినా నా పలుకు లన్నియు
పొలుమాలక వినతి సేయుము!
మఱచిపోకుము! మాట దప్పకు
మనవి సేయుమ! నొక్క టొకటిగ! ॥అందమగు॥

ఒంటిగా తానుండ జూడుము!
జంట నెవ్వరు లేని క్షణమున!
కాంతనగు నా కష్టగాధను
కాంతునకు వినిపింపు మోయీ! ॥అందమగు॥

పుష్ప వాటికయందు గానీ
పూర్ణ చంద్రుని గాంచు నపుడో!
ఉదయ సంధ్యల ఖూచుతఱినో
సదయ! నా వ్యధ వినతి సేయుము! ॥అందమగు॥

పూసగ్రుచ్చిన యటుల నా మొఱ
పూర్ణ పురుషుని కందజేయుము!
జాలి దయ లుప్పొంగగా జల
జాక్షునకు వినిపింపుమన్నా! ॥అందమగు॥

## అరుణ కమలము అందుకొనుమా!

అందుకొనుమా!

అనుసరింపుము గగన మార్గము
కనులలో ప్రాణములు నిలిపీ
కందుచుంటిని జలదరా! ॥అరుణ కమల॥

వేగమే నా ప్రేమ లేఖను
విభుని సమ్ముఖమునకు జేర్చుము!
జాలి కలుగగ, మాట నేర్పున
జాణతనమున వినతి సేయుము! ॥అరుణ కమలము॥

పవలు రాత్రులు నెదురుజూచుచు
బరగ శిలగా నైతిననుమా!
నిదుర నీరము అన్ని వదిలీ!
నీరసించిన దనుచు బలుకుము! ॥అరుణ కమలము॥

కంటినీరే కాల్వలుగ ధర
కలకలా ప్రవహించె ననుమా!
మింటిచుక్కలు గూడ నాపై
కంటిచుక్కలు రాల్చె ననుమా! ॥అరుణ కమల॥

అన్న జలధర! కన్నదంతయు
విన్నపముగా తెలియ జేయుము!
మూగినగు నా మనసు వేదన
మోహనాంగున కంద జేయుము! ॥అరుణ కమలము॥

## నెమిలి పించపు గోపబాలుని!

నెమిలి పించపు గోపబాలుని
నీటులే నా మదిని నిండెను!
కన్నులే యతడైన జలధర!
గాంచ యిక నేమున్నదీ? ॥నెమిలి పించపు॥

నల్లి కలువల జూడ నా మది
నాట్యమాడగ జాలదేలనో?
పుల్లి కమలము గాంచి నా హృది
పొంగి గీతము బాడ దెందుకొ? ॥నెమిలి పించపు॥

పలుకు బలికే చిలుక జేరీ
కులుక నా మన సొప్పదేలనో!
పాటబాడే కోకిలమ్మకు
పజ్జ జేరను ఎందుకో మరి? ॥నెమిలి పించపు॥

పూల దీవెను జూడ నా మది
పొలుపు గులుకదు! ఎందుకో మరి?
మింటి చుక్కల మిల మిలలు నా
కంటి కింపును గూర్పవూ! ॥నెమిలి పించపు॥

భ్రమర కీటక న్యాయమున నా
భక్తి యటులను మారె సఖుమా!
విన్నవింపుము నాదు విరహము
వేద విదునకు జలధరా! ॥నెమిలి పించపు॥

## కరుణ జలధర కదిలిచనుమా !

కరుణ జలధర ! కదిలి చనుమా !
కాంతు డుండెడి దేశమునకును !
మధురమగు నా విరహగీతిని
మాధవుని కందింపుమా ! ॥కరుణ జలధర॥

దూరదేశం బనుచు మదిలో
ఖార మనుచును విసువు జెందకు!
కామితార్థము లిచ్చుచే గద !
కరుణ జూపెడి సజ్జనుల కిల ! ॥కరుణ జలధర॥

ఉన్నతములగు పర్వతములను
ఉచ్చ శిఖరము లధిగమింపుము !
మదిని కష్టములని దలంపకు
మానినిని ! నా కోర్కె దీర్పగ ! ॥కరుణ జలధర॥

నదీనదములు చీకు టడవులు !
నగరములు గ్రామములు దాటుము !
తీయనీ నీ వర్ష ధారల
దీర్చి తాపము సుఖమునిమ్మా ! ॥కరుణ జలధర॥

రంగురంగుల భూమి తల్లికి
రమ్యశోభల గూర్చు శిల్పివి!
బాటసారిగ పైని బోవుచు
బాధలన్నియు దీర్చువాడవు ! ॥కరుణ జలధర॥

# నీలఘన ! శుభ సాంద్ర హృదయా !

నీలఘన ! శుభ సాంద్ర హృదయా !
నిర్మలోదక ! వర్షదాతా !
కఠినమగు నా కార్యసాధన
కార్యమును చే పూనుకొనుమా ! ॥నీలఘన॥

ఘోరమగు ఘన గర్జనలతో
నుఱుము లుఱుమకు ! పిడుగురాల్పకు !
మోదమున నా విభుని జేరగ
హ్లాదమున పయనమ్ము గమ్మా ! ॥నీలఘన॥

తళుకు తళుకున మెఱుపు మెఱయుచు
తరువులను ధర గూల్చివేయకు !
విందు దనమున బయలుదేరుము !
నీలిమబ్బుల తోరణములను ! ॥నీలఘన॥

ఏడురంగుల యింద్ర ధనుసును
వేడుకను జేతను ధరింపుము !
చిలుక గుంపులు పికిలిపిట్టలు
జేరి నీ పద మనుసరింపగ ॥నీలఘన॥

సన్ననీ బిందువుల జార్చుము !
చల్లనీ మాధురిని విరియుము !
తిన్నగా నా పతిని జేర్చుము !
విన్నవింపుము నాదు విరహము ! ॥నీలఘన॥

## ఆర్ద్ర హృదయా ! నీల జలధర !

ఆర్ద్ర హృదయా! నీల జలధర !
యలరి వినుమొక మాట దయతో !
పతికి నా మొఱ వినతి సేయుము !
దివ్య కవిత సుగీతులన్ ! ॥ఆర్ద్ర హృదయా॥

ఆటలను నలరింపుమా! విభు
పాటలను బులకింపుమోయీ !
రక్తిగా నామాట ముచ్చట
రమణునకు నెఱిగింపుమా ! ॥ఆర్ద్ర హృదయా॥

కొమ్మ వీడిన తీగవలె తన
కమ్మదనముల మాసె ననుచును !
దివిని జూచుచు భువి చరించెడి
దీనురాలని బల్కుమా ! ॥ఆర్ద్ర హృదయా॥

రాత్రి దివసలు నిను దలంచుచు
రంగుమాసిన ప్రతిమ రీతిని !
చిక్కి సగమై స్రుక్కినది యని
మక్కువగ వినిపింపుమా ! ॥ఆర్ద్ర హృదయా॥

నిరతమును నీ పూజ సలుపుచు
నీదు గీతము పాడు సుదతిని !
కరుణ బ్రోవవు? ఎందుకంచును
గఱుగ మది ప్రశ్నింపుమా ! ॥ఆర్ద్ర హృదయా॥

## నీలఘన ! ఓ నిర్మలోదక !

నీలఘన ! ఓ నిర్మలోదక ;
నిఖిల జగముల కన్నదాతా !
కాంతునకు నా విరహ గీతము
కరుణతో వినిపింపుమా ! ॥నీలఘన॥

చిన్ని చిన్ని తుంపురులతో
సన్న సన్నని పిల్లగాలుల !
వన్నెలా శ్రీకృష్ణుతో నా
వలపు వంతను దెలుపుమా ! ॥నీలఘన॥

మెల్లగా గర్జనలు సేయుచు
అల్లనల్ల నమస్కరింపుము !
వన్నెలా మెఱుపుల తళుకున్గన
వందనములను నాచరింపుము ! ॥నీలఘన॥

ఏడువన్నెల యింద్ర ధనుసును
వేడు కలరగ పూలమాలను
స్వామికర్పణ సేయుమన్నా !
సరసరీతిని వైజయంతిగ ! ॥నీలఘన॥

మనసు విప్పి జెప్పి నామది
మనసునందలి భక్తి భావము !
మాధవుని కందించి నాపై
మమత గలుగగ జేయుమన్నా ! ॥నీలఘన॥

## అఖిల విశ్వమునకు విచిత్రము

అఖిల విశ్వమునకు విచిత్రము !
ఆది దంపతులకు నివాసము!
వెండికొండలు గానవచ్చును
వేడ్కతో వంపనము సేయుము! ॥అఖిల॥

మూడు నదులకు సంగమం బది
మునుల యోగుల తపోవన మది!
యమున గంగా సరస్వతులకు
నలరి పుష్పాంజలుల నిమ్మా! ॥అఖిల॥

స్వర్ణ కమలములుండు మానస
సరసిలో తీర్థములు గైకొను!
సృష్టిలో శృంగార మంతయు
స్పష్టముగ నీ కట స్ఫురించును! ॥అఖిల॥

చేయవలపిన కార్య విధులను
జేయగూడని పనులివంచును!
విజ్ఞులకు వినిపింప వలెనా?
అజ్ఞతకు మన్నింపు మన్నా! ॥అఖిల॥

కలత జెందిన మనసు జెదిరిన
కాంతనోయీ! మనసు నొవ్వకు!
వింతగా నా పలుకు తలపకు!
చింత దీర్పగ వేగ చనుమా! ॥అఖిల॥

## మేఘుడా! యిక కదిలి పొమ్మా!

మేఘుడా! యిక కదిలిపొమ్మా!
మింటి చుక్కల దారులందున!
మధురమగు నా ప్రణయ వాంఛను
మాధవుని కందింపుమా! ॥మేఘుడా॥

వెన్నెలను నే నొంది పొందిన
వేదనను వెడిపింపు మన్నా!
తెల్లకలువగ మారె ననుమా!
కల్లగావని దెలుపుమా! ॥మేఘుడా॥

శిలల జారిన జాలువలె దా
గలగలా హృది గీతి పాడుచు!
నిమర రాకను నెదురు జూచుచు
నీరసించిన దనుచుమా! ॥మేఘుడా॥

చిగురు టాకులు జిన్ని పూవులు
చిత్రమగు పూసెజ్జ లన్నియు
మదిని తాపము దీర్పవనుమా!
మంచి గంధపు బూతలున్! ॥మేఘుడా॥

విన్నపము నందించి విభునకు
వేయి విధముల విశదపఱుపుము!
అంజలిని ఘటియించి నిలిచిన
యార్తురాలని దెలుపుమా! ॥మేఘుడా॥

## నీలివర్ణుడ! నింగి మేఘుడ!

నీలివర్ణుడ! నింగి మేఘుడ!
నిలువ కిక వేవేగ చనుమా!
కాంతునకు నా కష్ట గాథను
కరుణతో వినిపింపుమా! ॥నీలివర్ణుడ॥

దారిలో విశ్రాంతి గొనుచును
జాగు సేయుచు నుందు వేమో!
సుందరంబగు భూమితల్లీ
యందములు పరికింతు వేమో! ॥నీలివర్ణుడ॥

అందమగు పూదోటలను గని
యలరి నిలిచెద వేమొ నటనట!
సుందరంబగు దృశ్యములగని
యందె నిలిచి పోదువేమో! ॥నీలివర్ణుడ॥

గిరుల గిరి శిఖరముల గాంచుచు
ఝరుల లోయల మోహమందుచు
కనక పర్వత కాంతులను గని
కలిగి యట నిలుచుందువేమో! ॥నీలివర్ణుడ॥

కార్యదీక్షా పరులు విడువరు
కార్యమును సాధించు వఱకును!
మానినిని! నీ సోదరిని! నా
మధుర వార్తను బతికి జేర్పుము! ॥నీలివర్ణుడ॥

# పరవశంబున నీల జలధర !

పరవశంబున నీల జలధర !
పాడలేనని తెలుపుమోయీ!
పాట తోడను మధుర వీణను
మీటలేనని దెలుపుమోయీ! ॥పరవశంబున॥

తీయ తీయని తేనె వాక్కుల
తీర్చి కూర్చగ జాలదనుమా!
అందమగు రాగాల గీతిని
యాలపింపగ జాలదనుమా! ॥పరవశంబున॥

మంజులంబగు మధుర భావము
మదిని విరియగ స్ఫూర్తి లేదను!
సుందరంబగు సృజన శక్తిని
యందముల గోల్పోతి ననుమా! ॥పరవశంబున॥

మురళి పాటకు ముద్దు లొలుకగ
మోద మలరగ రక్తి తోడుత!
కంఠమెత్తి కల కల ధ్వని
కాంత పాడగ జాల దనుమా! ॥పరవశంబున॥

కణ్ణ! నీ పద భక్తి చేతను
కాంత కృశియించిన దటంచును!
నిలువ లేదను! పిలువ లేదను!
నిన్నికను మఱి దలవ లేదను! ॥పరవశంబున॥

# అన్న! జలధర!

అన్న! జలధర! యుంటి నను మిక
యలసతను విడనాడు మోయీ!
అఖిల పతి కందింపు నా మొఱ
నాలసింపకు! వేగ జనుమా! ॥అన్న! జలధర!॥

పుణ్యభారత భూమిగదె! యిది!
పూర్ణ జగతికి మణి కిరీటము!
అఖిల విద్యల కాలవాలము!
నిఖిలమున కిది పూర్ణ బింబము! ॥అన్న! జలధర!॥

వానిలో గనిపించు నెన్నో
తీర్థరాజము లడుగు నడుగున
భక్తితో నర్ఘ్యముల నొసగుచు
రక్తితో ముందునకు జనుమా! ॥అన్న! జలదర!॥

దివ్యమగు క్షేత్రముల గాంచుచు
పుణ్య గోపురములను జూడుము!
దేవ చరితల తీర్థముల గని
వేడ్కతో ముందునకు సాగుము! ॥అన్న! జలధర!॥

కనకగిరి నీ కడ్డు వచ్చును
గాంచుమోయీ యొక్క నిముసము
కవితలను కమనీయ గీతల
గాలమును వ్యయపరుప కోయీ! ॥అన్న! జలధర!॥

## రంగురంగుల నీల జలధర!

రంగురంగుల నీల జలధర!
రమణునకు నా వార్త దెలుపుము
విరహవేదన తాపముల నిటు
విన్నవింపుము నేర్పునన్! ॥రంగురంగుల॥

కనుల కాటుక విడిచినది యని
కరుణ గలుగగ దెలుపుమోయీ!
నిచుర నీరము వదిలినది యని
సదయునకు వివరింపుమా! ॥రంగురంగుల॥

చల్లనగు ముత్యాల దండలు
సఖియ మేనుకు వెచ్చనై కడు!
భోగిపండుగ యగ్నిమంటలు
పోలతి కగునని బలుకుమా! ॥రంగురంగుల॥

మాట మంతియు లేకయుండును
మౌనముద్రను దాల్చునెప్పుడు!
పక్షి పలికిన నీవటంచును
భ్రాంతి పడునని దెలుపుమా! ॥రంగురంగుల॥

తలుపువాకిలి దీసియుంచును
తరుణి నిను వీక్షించు దలపున!
యనుచు దెలుపుము నాత్మనాథుకు
నలరు నా మది విరహమున్ ॥రంగురంగుల॥

## పయనమగు ఓ జలధరా!

పయనమగు ఓ జలధరా! నా
పలుకులను మది యాలకింపుము!
చిన్నికోర్కెల కొన్ని దీర్చుచు
శీఘ్రముగ నాపతిని జేర్చుము! ॥పయనమగు॥

దారి పొడుగున నీవు వెడలిన
ధాత్రినంతను బదును సేయుము!
బీడువారిన పుడమితల్లిని
ప్రీతి సేయుము వర్షధారల! ॥పయనమగు॥

ఎండిపోయిన వృక్ష సంతతి
కండగా నిలు! నీటి జల్లుల!
చిగురు పూవులు సిరులు దొలకగ
చిత్రసీమగ మార్చి వేయుము! ॥పయనమగు॥

బక్కచిక్కిన యాలమందల
చిక్కి శిథిలములయిన మొక్కల!
తుష్టిపుష్టిని గలుగజేయుము
కష్టములు గట్టెక్క జేయుము! ॥పయనమగు॥

పుణ్యకర్మల ప్రోవులే కద!
పూర్వపుణ్యపు నిదులనందురు
పుణ్యకర్మల జారవిడువరు
పుణ్యవంతులు నిద్ధరిత్రిని! ॥పయనమగు॥

## పుడమి బాంధవ! పుణ్యపురుషా!

పుడమి బాంధవ! పుణ్యపురుషా!
పృథివి జనులకు నార్తి బాపుము!
సర్వసస్యములును ఫలింపగ
సరసదృష్టిని జూడుమన్నా! ॥పుడమి బాంధవ!॥

ఎండ వానలలో శ్రమించుచు
బండచాకిరి పాటు బడుదురు!
కర్షకుల కన్నీరు బాపుము!
కామ్యముల బరిపూర్తి జేయుము! ॥పుడమి బాంధవ!॥

చక్కనీ వర్షములు గురియుము
మిక్కిలీ సస్యములు పండగ!
అన్నదాతలు తృప్తి నొందగ
ఆదరింపుము! లోకబాంధవ! ॥పుడమి బాంధవ!॥

అదునులో వర్షములు గురియుము!
అలరి పెరుగును సస్యసంపద!
భూమితల్లికి నూత్న యౌవన
భూతి కీవే కారణము గద! ॥పుడమి బాంధవ!॥

పుణ్యకర్మలు జేయువారే
పుడమిలో బూజ్యతను గాంతురు!
దానధర్మము లాచరించుచు
దరికి జేరుము నాదు విభునీ! ॥పుడమి బాంధవ!॥

## నీల జలధర ! నింగిరాజా !

నీలజలధర ! నింగిరాజా !
నిర్మలోదక ! వర్షదాతా !
మదిని దయలుప్పొంగగా నా
మనవి పతి కందింపుమా ! ॥నీలజలధర॥

తీయ తేనియ మధుర ద్రాక్ష
తీపి ఖాద్యములను త్యజించితి !
మధురమగు విభు నామ జపమే
మనసు కగు పలు మధుర రసములు ! ॥నీలజలధర॥

మధురవీణను నాలకించుట
మధుర గీతము లాడిపాడుట !
మానితిని ! మర్మముగ కాంతుని
మనసునను ధ్యానించు చుంటిని ! ॥నీలజలధర॥

కనుల భాష్పములను స్రవించుచు
కాంతుకొఱకై హృది తపించుచు !
వెన్నెలను మధు పుష్పవాటిక
వేణువును నే నూదుచుంటిని ! ॥నీలజలధర॥

అన్న జలదర ! ఆర్ద్రహృదయా !
యార్తినంతను పతికి దెలుపుము !
దూతగా నిను బంపుచుంటిని !
దోస మెంచకు మోయి సోదర ! ॥నీలజలధర॥

## చింతచెట్టుకు చిగురులెన్నో !

చింతచెట్టుకు చిగురులెన్నో
చెలియరో ! నా బాధలన్ని !
తెచ్చుకుంటిని నాకు నేనే !
తీర్పజాలరు నీ భువిన్ ! ॥చింతచెట్టుకు॥

మనసు నందున నిలుపుచుంటిని
మాధవుని నా విభుగ జేసి !
పతిని సతినీ జతనుగూర్చె
పరమ పురుషులు యెవ్వరే ! ॥చింతచెట్టుకు॥

చిత్రముగ నే వ్రాసికొంటిని !
చిన్నికృష్ణుని మధుర రూపము !
అందముగ నను జేర్చి వ్రాసే
యతివ లెవ్వరు జెప్పవే ! ॥చింతచెట్టుక ॥

శిల్పముగ నే జెక్కికొంటిని !
చిత్రముగ నా మనసు నందున !
నన్ను మలిచెడి వారలెవ్వరు
నాథుప్రక్కన మూర్తిగా !

కానిపను లివి కథలె యగునవి
కాంత నామది కంత దెలియును !
కాని పనులకు బూనుకొంటిని !
కాంత ! యేమగునో యికన్ ! ॥చింతచెట్టుకు॥

## పల్లవించిన చిగురులన్నీ

పల్లవించిన చిగురులన్నీ
పండి నేలను రాలిపోనీ!
తెల్ల మల్లెలు వాడిపోయీ
పెల్లుగా భువి రాలనీ! ॥పల్లవించిన॥

మదువసంతము మాసిపోనీ!
మందనీచిక లాగిపోనీ!
కోకిలమ్మకు గొంతుపోయీ
కుక్కు_రో! యని కూయనీ! ॥పల్లవించిన॥

చైత్ర రథమున ఫలరసంబులు
చిత్రముగ ధర పొరలిపోనీ!
రాలినా పుష్పాదులు రాశిగ
రాత్రి నలువుల జేరిపోనీ! ॥పల్లవించిన॥

చిలుక వనితలు, పికిలిపిట్టలు
చెట్టుకొమ్మల లేకపోనీ!
మావికొమ్మకు మాధవీలత
మంచి మాటలు లేకపోనీ! ॥పల్లవించిన॥

నేను నిత్యము నాదు పతియును
నిత్యసత్యు ననంత కాలము!
నిలుచు నా హృది నాదు విభుడును
నిత్యనూత్న వసంతమున్! ॥పల్లవించిన॥

## వేయి దీపము లొకట జూచిన

వేయి దీపము లొకట జూచిన
వేడుకను నే పొందనే చెలి!
మురళి నూదే మోహనాంగుని
మురిపమే నా మదిచలించును! ॥వేయి దీపము॥

రంగు రంగుల మేఘమాలిక
రమ్యతను నే నిష్ట పడనే!
నీలి గగనపు నిర్మలతయే!
నిక్క జూచెద ననవరతమూ! ॥వేయి దీపము॥

వాద్యముల సంగీత ధ్వనులను
చోద్యములు నే మెచ్చుకోనే!
మధుర మురళీ నాద సుధలే
మనసు మోదము నొందునే! ॥వేయి దీపము॥

పూల తీవెల పుష్పవాటిక
స్ఫూర్తి సుందరములను జూడను!
కలువ కన్నెల మధ్య నిలిచిన
కమలమే నా కిష్టమే! ॥వేయి దీపము॥

కనులు కనవే! చెవులు వినవే!
మనసు మర్మము లెరి తెలియదు!
కృష్ణభక్తిని లీనమైతిని!
కోమలీ! నే నెవరొ తెలియదు! ॥వేయి దీపము॥

## దూర ప్రాంతమునందు యేదో!

దూర ప్రాంతమునందు యేదో
ధూళిరేగెను రంగు రంగుల!
స్వామి రథ మిటు వచ్చెనేమో!
సఖియరో! వద! పోయి చూతము! ॥దూర ప్రాంతము॥

వానకోయిల వచ్చెనదిగో!
వార్తనడిగి తెలిసికొందము!
పుష్పవాటిక రథము దిగెనా?
పూర్ణ పురుషుని తోడగూడుక! ॥దూర ప్రాంతము॥

చిలుక కన్నియ జేరవచ్చెను
చేటి! యడుగవె! స్వామి వార్తను!
రథము దిగెనా? నాదు నాధుడు?
నాల్గుదిశలను వెలుగు లొచ్చెను! ॥దూర ప్రాంతము॥

హంస మిధునము నదిగొ వచ్చెను
జంట కత్తియ! యడుగవమ్మా!
ఎవరికోవము విభుడు వచ్చెనొ?
ఎందుకొ ఇకో యడుగు వేగము! ॥దూర ప్రాంతము॥

ఆర్తు రాలి నటంచు దయగొని
ఆర్ద్రి హృదయుడు నయ్యెనా పతి?
పిలువ నంపెన ప్రియతమా! యని
ప్రియుని గలియగ బోవుదునె సఖి? ॥దూర ప్రాంతము॥

## అధరమందున నిలిచి పలికే!

ఆధరమందున నిలిచి పలికే
మధుర స్వరములు బలుకువానా!
మధుర మురళీ! మనవి సేయుము!
మాధవునితో నాదు విరహము! ॥అధరమందున॥

మాధవుని హస్తమున నలరీ
యఖిల భక్తుల శీర్షమందున!
ప్రేమతో నాశీస్సులను నిడి
ప్రియ మొనర్తువు! మధుర స్వరముల! ॥అధరమందున॥

నీదు మోహన గాన మురిలో
నిలిచిపోతిని కృష్ణదాసిగ!
పరవశించితి నీదు స్వరముల
పతిత పావను సఖియనైతిని! ॥అధరమందున॥

నీవు లేకను నీలవర్ణుని
నిలిచి నేవరియించి యుందున?
నీవె సర్వము నిర్వహింపుము
నిఖిల పతితో నేను జేరగ! ॥అధరమందున॥

స్వామితో నా వినతి దెలుపుము!
సఖియరో! ఓ మధుర మురళీ!
మధుర తత్త్వము దెలియుజానవు!
మర్మమంతయు దెలియుగాదా! ॥అధరమందున॥

## అతివ! యదె! బంగారు పల్లకి!

అతివ! యదె! బంగారు పల్లకి
యాత్మ విభుపది యంపినాడట!
వెడలుచుంటిని వేడు కలరగ
విభుని సన్నిధి జేరగన్! ॥అతివ॥

కనుల కాటుక బెట్టరమ్మా!
కస్తురీ తిలకమును దిద్దీ!
పూలు ముడువుడు! పూర్ణకలశము
పొందుగా నా చేతి కివ్వరె? ॥అతివ॥

పొలుపుగా నగలన్ని బెట్టీ
బుగ్గ చుక్కను బెట్టరమ్మా!
అందలము నెక్కించి నన్నిక
యంపరమ్మా ప్రేమతో! ॥అతివ॥

మురళి నంపెను మోహనాంగుడు!
ముద్దుగా నను దోడితెమ్మని!
పల్లకిని నే బోవుచుంటిని!
భద్రమగు మీ కెప్పుడున్! ॥అతివ॥

జన్మ జన్మల కోర్కె దీరెను!
జగతి బంధములన్ని బాసెను!
మధుర ప్రేమకు ఫలముగా నిదె!
మాధవునితో గలియుచుంటిని! ॥అతివ ॥

# వెలిగెడి దీపాని కెన్నో!

వెలిగెడి దీపాని కెన్నో
వేల కష్టాలొచ్చె నమ్మా!
చెలియ! నా మన సిట్టు లాయెను!
చివరి కెట్లగునో కదా! ॥వెలిగెడి॥

తైలధారలు లుప్తమాయెను
ధాత్రి వంకను జూడసాగెను!
మధుర కాంతుల దీప్తి తగ్గెను!
మంద కొడిగా వెలుగుచున్! ॥వెలిగెడి॥

ప్రమిద టీటలు వారి యడుగున
బ్రద్దలగుటను గాన వచ్చెను!
గాలి కల్లాడుచును రెపరెప
కాంతి తగ్గుచు చెదురుచున్! ॥వెలిగెడి॥

అట్టి దీపము వలెను నేనూ!
యదలుచుంటిని! నిట్టు నట్టుల!
రక్షసేయగ నాధు డెన్నడు
రమణి రయమున వచ్చునో! ॥వెలిగెడి॥

ఆరిపోవగ నీను దీపము!
యఖిలపతి దా వచ్చు వఱకును!
మఱచిపోవను! మధుర నామము
మాధవుని మది లోపలన్! ॥వెలిగెడి॥

## చెదిరిపోదే! చిదికిపోదే!

చెదిరిపోదే! చిదికిపోదే!
చెలియ! నా మది దివ్యచిత్రము!
జన్మజన్మల స్నేహమే యిది
చెఱిగిపోదే యెన్నడున్! ॥చెదిరిపోదే॥

రంగులన్నీ మాసిపోయిన
రమ్య కాంతులు వెలిసిపోయిన!
ఎన్నటికినీ విభుని మఱువను!
సన్నుతింతును నా మదిన్! ॥చెదిరిపోదే॥

శిల్పమంతా చిదుపలవనీ
చిత్రమంతా చినిగిపోనీ!
మున్ను జూచిన రూపె నా మది
కన్నులకు గనిపించునే! ॥చెదిరిపోదే॥

మధుర గీతము మఱచిపోయిన
మందగతి నా కంఠమైనా!
దివ్య నామము మఱచిపోనే
తీరుగా నా నాలుకన్! ॥చెదిరిపోదే॥

ఏదీ రానీ! యేది పోనీ!
ఎన్నటికి మా ప్రేమ తరుగదు!
ధ్రువునివలె నా హృదయ పీఠిక
తోరముగ నిలుచుండునే! ॥చెదిరిపోదే॥

## అంబరంబున చుక్కనే! చెలి!

అంబరంబున చుక్కనే చెలి!
అతివరో విను! అతడు గగనము!
అతనిలో నే నణగియుందును!
అతడు లేనిది నేను లేనే! ॥అంబరంబున॥

నేను కిరణము! అతడు దీపము!
దీపకాంతికి యతడు మూలము!
స్నేహధారల చింది కాంతుల
చిత్రముగ భాసింతునే! ॥అంబరంబున॥

అతడు గీతము! నేను రాగము!
నేను పాటను! అతడు నాదము!
అతనిలో నే నణువునే చెలి!
అతనిలో నే మసలుదున్! ॥అంబరంబున॥

నే మయూరిని యతడు మేఘము
నేను కమలము నతడు భానుడు!
చెలికిరో! యిదె! మాదు స్నేహము!
కాంతుతో నిదె బంధమూ! ॥అంబరంబున॥

అతడు సూత్రము! నేను ముత్తెము!
కలిసియుందుము! కలిసి యొకటై
హారమై ముత్యాల పువ్వుల
తోరమై విడివడకనూ! ॥అంబరంబున॥

## అలలపైనీ తేలిపోతూ !

అలలపైనీ తేలిపోతూ
యరుగుమా! ఓ పూలమాలా !
ఆవలొడ్డున నాదు కడకూ
యాలసింపక వేగ జనుమా ! ॥అలలపైనీ॥

ఆవలొడ్డున మందిరములో
నలరియుండును దివ్యశోభలు !
మదిని విరహము దెలియ జేయుము!
మాధవునితో నెమ్మదిన్ ! ॥అలలపైనీ॥

నీరు విడిచిన చేపకును వలె
నిశ్చలత గోల్పోయె ననుమా !
సుడులు దిరిగే పడవలాగున
ముడులు దిరుగుచు నున్నదనుమా ! ॥అలలపైనీ॥

ఆలసించిన నరుగు ప్రాణము
నిలిచినను నీరగును హృదయము!
క్షణమునకు యేమగునో యేమో !
సఖియ కని వివరించి దెలుపుము ! ॥అలలపైనీ॥

చెట్టు కొక్కొక పూవుదెచ్చి
కట్టినది నను వైజయింతిగ !
వచ్చితిని యను వరునితో నా
వన్నెలన్నియు విప్పి జెప్పుము ! ॥అలలపైనీ॥

## విరహిణిని నే బ్రతుక దగునా?

విరహిణిని నే బ్రతుక దగునా ?
వేయి యగ్నుల దేలిమాడుచు !
సఖియ ! నను చితి జేర్పవమ్మా !
సరసు దప్పు డిక వచ్చునేమో ! ॥విరహిణిని॥

చితిని మండి శీర్ణమైనా
చింతలన్నీ మాసిపోయిన !
కాంతు డప్పుడు వచ్చి చూచునా?!
కరుణ జూపునా ! కనికరించునా ! ॥విరహిణిని॥

పంచ భూతములందు గలిసిన
బాంధవీ! యని నన్ను బిలుచున?
అంటుకొనునా నాదు భూతిని
ఆదరించున నాటి స్నేహము ? ॥విరహిణిని॥

కథను నాదు స్మరించునా చెలి ?
కమ్మనీ నా మదుర గీతిని !
కంటి కొలకులు నిండి భాష్పము
తొంటిగా నాడి రాల్చునా ? ॥విరహిణిని॥

ఆదరింపగ సఖియ లేదను !
ఆర్ణవములో గలిసె ననుమా !
పిడికిలిని నా భూతి బట్టుక
క్షితి గంగను గలుపు మనుమా ! ॥విరహి॥

## ఒక్కటొకటిగ విప్పిజెప్పిన

ఒక్క లొకటిగ విప్పిజెప్పిన
పిక్కటిల్లును నాదు వేదన !
అక్క! నన్నిక మందలింపకు
ముక్కలగు నా హృదయమున్ ! ॥ఒక్కటొకటిగ॥

రాత్రి నిద్దుర బోదు చెలియా !
రమణునే మది దలచుచుండును !
ఎల్లవేళలు నతని నామము
నాలపించుచు నుండునే ! ॥ఒక్కటొకటిగ॥

చుక్క లుదయించుటను జూచును !
జూచుచుండును నస్తమించుట !
కలత నిద్దుర యందు గూడను
కాంతునే తిలకించునే ! ॥ఒక్కటొకటిగ॥

పూలు ముడువగ మనసుబోదూ !
పొలుపుగా కాటుకను దిద్దదు !
అధరమందున యలతి నగవుల
యందములు రానీయదే! ॥ఒక్కటొకటిగ॥

మనసు గలిసెను మాధవునితో
మర్మ మది నాకేమి తెలియదు !
ఇట్టి కష్టము లొందు చుంటిని !
ఇంతి నా మది చేష్టలన్ ! ॥ఒక్కటొకటిగ॥

# అమ్మలారా! కొమ్మలారా !

అమ్మలారా! కొమ్మలారా!
అలరు నా ప్రియ సఖియలారా!
మాధవుం డిటు వచ్చె ననుచును
మంచిమాటను బలుకరమ్మా! ॥అమ్మలారా॥

విరహ తాపము పొగలు సెగలై
పొటమరించీ మిన్ను దాకెను !
ఆ మనోహరు వచ్చు వార్తను
నలరి నా చెవి వేయుడమ్మా ! ॥అమ్మలారా॥

చుక్కలారా ! రిక్కలారా !
సుందరంబగు చందమామా !
మలయ పవనమ! మాలతీ లత!
మదిని తాపము దీర్చుడమ్మా ! ॥అమ్మలారా॥

ఎందఱెందరొ దూతికలతో
నంద జేయగ నాదు వార్తను!
అంపితిని గద! యొక్కరైనను
నలరి దెలుపుడు విభుని భావము ! ॥అమ్మలారా॥

వచ్చినా వా రెవ్వరయినను
'వచ్చె హరి!' యను నొక్కమాటను
ముచ్చటగ నా చెవిని వేయుడు !
నచ్చముగ యానంద మొందెద ! ॥అమ్మలారా॥

# అడుగనులే! అడుగనులే!

అడుగనులే! యడుగనులే!
యార్తితోని యాచింపను!
ప్రవిలమగు పనసుతోని!
బన్నుగ నిను జూచుచుందు! ॥అడుగనులే॥

వేదనతో, దీనతతో
వివరింపను హృదయఘోష!
ఉదయ సంధ్య రాగముతో
సదయ! మదిని బాడునుందు! ॥అడుగనులే॥

పెదవి విప్పి మాటాడను!
మదిని కోరికను దెలుపను
అంతులేని నా వేదన
నుంత నీకు దెలుపనులే! ॥అడుగనులే॥

ఎంతకాల మిటుల నేను
అంతులేని యాత్ర జేతు?
కొండ కోనలను దిరుగుచు
ఎండ వానలను మ్రగ్గుచు! ॥అడుగనులే॥

ఖండితముగ నీదు మనసు
బండరాయి యని దలచెద!
కన్నీరే మిన్నేరుగ
కానిపింపదా ప్రియ సఖ? ॥అడుగనులే॥

## కలత నందను! వెతను జెందను!

కలత నందను! వెతను జెందను
కామితమున నిరాశ నందను!
ఎన్ని జన్మలు గాని యిటులను
సన్నుతించెద చిన్నికృష్ణా! ॥కలత నందను॥

చిన్నిపాటల బాడుకొనుచును
వన్నెలా నిను మదిని గాంచుచు!
కన్నెగా నల గొల్లభామగ
చిన్నెలను విరజిమ్ముచున్! ॥కలత నందను॥

ఆఱు ఋతువుల యందునను మఱి
యలమటించుచు నిన్ను గాంచగ!
వేదనల రాగముల దీయుచు
వేడు కలరగ నుండుదున్! ॥కలత నందను॥

చిగురుటాకుల పూవులను మఱి
చిత్రముగ నె [illegible]
మనసునందున కృష్ణ విరహము
మమతతో నే దెలుపుదున్! ॥కలత నందను॥

నీదు రాకకు వేచియుండెద!
నిర్మలంబగు భక్తి తోడుత!
కనులలో బాష్పములు నిలుపుచు
కామితము నే గోరుదున్! ॥కలత నందను॥

## కలిసి పాడలేను కృష్ణ!

కలిసి పాడలేను కృష్ణ!
కమ్మని నీ మురళి తోని!
వినిపింపగ లేను మదిని
విమలమైన మధుర గీతి! ॥కలిసి॥

పాటలు మాటలుగ మారె
దివ్యమైన హృదయ వీణ!
మధుర స్వరము గీతికలో
మాయమాయె విరహముతో! ॥కలిసి॥

నీటిలోని యలలరీతి
నిలిచియుండలేదు గీతి!
పరుగు లెత్తు లేడివలెను!
పరవశించు విరహముతో! ॥కలిసి॥

ఎన్నాళ్ళీ యెడబాటులు!
ఎన్నాళ్ళీ కష్టగాధ!
చేసిన పూజలు వ్రతములు
జేరరావు! దరికి కృష్ణ! ॥కలిసి॥

చేసిన వినతుల గైకొని
జేరరమ్మ! నాదు కుటిని!
నీ దరికిని జేరలేను!
నీవు రమ్మ! నా చేతువ! ॥కలిసి॥

## అఖిల లోకము లన్నిటికి

అఖిల లోకము లన్నిటికి
ధారభూతుడవైన నిన్నూ
చిన్నికృష్ణా! యనుచు చి
చిత్రమైనా రూపు జేసీ!

కోటికోటి లోకములనూ
గూర్చువాడవు నీవు గాద
త్రుటిని మాయము జేయ
తోరముగ పోషించు వాః

ఇందు గలవని! యందు
యెందువెదికిన యందుగ
ఎందఱెందరో బలికినా నిను
నంఃదముగ నిన్నిటుల జేసితి!

అఖిల లోకము లాక్రమించిన
యట్టి రూపము నెటులజూతును!
అఖిలజీవుల యందు గల నిను
అలవియా? గన శక్యమా? మఱి? ॥అఖిల॥

అఖిల చైతన్యమును నీవే!
యా పరంజ్యోతివియు నీవే!
అందుకే నిను జూడజాలక
యంటి 'చిన్ని కృష్ణ!' యనుచును! ॥అఖిల॥

## కలువ కన్నెలు కాంతి చంద్రుని!

కలువకన్నెలు కాంతి చంద్రుని
కలువరించెడి కైవడిని నే!
కమలములు నవ భానుదర్శన
కాంక్ష కుమిలెడి రీతిగన్! ॥కలువకన్నెలు॥

అడలుచుంటిని విరహగీతిని!
అఖిలపతి! యలరింపుమా నను!
కడలిపొంగుగ నాటుపోటుల
కనలు చుంటిని వేదనన్! ॥కలువకన్నెలు॥

మధు వసంతము రాకజూచెడి
మధుర కోకిల పోలికమ నే!
జలదమాలను జూడ కోరిక
ఆల మయూరీ వడుపునన్! ॥కలువకన్నెలు॥

నీదురాకను గోరుచుంటిని!
నిర్మలంబగు భక్తితోడుత!
అందమగు నా యాత్మ జ్యోతిని
అలరి నీ కర్పింపగన్! ॥కలువకన్నెలు॥

అందమగు నాకాశ వీధిని
ఎలరు సంధ్యల రీతిగా నే
నిండుచంద్రుడు శుభ్రజ్యోత్స్నను
నీటు గులికెడి నట్లుగన్! ॥కలువకన్నెలు॥

## పరుగులెత్తే యలలపైనీ!

పరుగులెత్తే యలలపైనీ
ఉరుకులెత్తే నీటిపైనా!
పడవనడుపుచు పయనమైనా
పథికురాలిని మాధవా! ॥పరుగులెత్తే॥

అటుపోటుల యలల లేచిన
యెలుముకొనినను పాల నుర్వులు!
అలసిపోనూ! సొలసిపోనూ!
అందుకొన నీ పదములన్! ॥పరుగులెత్తే॥

కదలి చెలియలి కట్ట దాటీ
వెడలి పొంగులు చుక్కలంటిన!
కదిలి వెనుకకు మఱలనోయీ
కామితార్థము దీరకన్! ॥పరుగులెత్తే॥

పెను తుఫానులు పెద్దపెట్టున
పెగిలి గాలి ప్రభంజనంబై!
వీచినను నే పీసమంతయు
వెనుకచూపును చూడనోయ్! ॥పరుగులెత్తే॥

గమ్యమును నను జేరనీరా!
కష్టములు నను బెట్టకోయీ!
నన్ను దాసిగ యేలుకొనుమా!
నావ నద్దరి జేర్చుమా! ॥పరుగులెత్తే॥

## వార్త లంపితి! లేఖ లంపితి!

వార్త లంపితి! లేఖ లంపితి!
వరుసగా దూతికల నంపితి!
వచ్చు జాడలు గానిపింపవు
వరుని జేరెనా! జేరలేదో! ॥వార్తలంపితి॥

కోకిలమ్మను జేరి విభునకు
కోమలముగా దెలుపమంటిని!
మధ్యలోనే మఱలి పోయెనా!
మాధవుని దరి జేరలేదో! ॥వార్తలంపితి॥

చిలుక పడుచుకు చీటి వ్రాసీ
చెలుని కిమ్మని సాగనంపితి!
దారిలో నది జారిపోయెనా
దారి యేదిక విభుని రాకకు! వార్తలంపితి॥

అంచభామకు నందె లొసగి
యలరి విభునీ దెమ్మనంటిని!
దారిలో తామరలు గనెనో
దారితప్పెనా! యేమి సేతును? ॥వార్తలంపితి॥

ఎవరి బాధలు వారివే గద!
యెవరి నన్నను నేమి ఫల మిక!
కన్నులను జీకట్లు క్రమ్మెను
కాంతు డెప్పుడు వచ్చునోకద! ॥వార్తలంపితి॥

# సెలయేఋలు జలజల పారే

సెలయేఋలు జలజల పారే
ఓఋశబ్దము చేసే చోటా!
తిన్నెలపై వెన్నెల జఋచిన
చిత్రములా తోచే చోటా! ॥సెలయేఋలు॥

మనుషులు వడి తిరుగనిచోటా
మాధుర్యం విరిసే చోటా!
ప్రేమ ఝరీ పొంగేచోటా
ప్రీతి విరిసి మెరిసే చోటా! ॥సెలయేఋలు॥

మంచుకురియు హేమంతంలో
మధురభక్తి నిను బాడుచునూ!
హరిపూజకు బోయే వేకువ
నణకువతో జెప్పాలనీ! ॥సెలయేఋలు॥

కొలనిగట్టు కూర్చొని యొంటిగ
కూరిమితో నవినయంగా
కలువపూల కన్నుల జూస్తూ
కాంక్ష నీకు దెలుపాలనీ ॥సెలయేఋలు॥

నీ మురళి స్వనముల లోపల
నిర్మలమై పోవాలనీ!
నీ జ్యోతిని జ్యోతిని గలిపి
నిత్యశాంతి నందాలనీ! ॥సెలయేఋలు॥

## విరహగీతము విన్నవించితి !

విరహగీతము విన్నవించితి !
వేయి రేకల పూవుగా నదె !
వెన్నెలకు పరె చిన్నె కొలుకుచు
నెన్నొ సొగసులు బోయితిన్ ! ॥విరహ గీతము॥

అఖిలపతి వని యాత్మబంధువు
ననుచు బలికితి ప్రీతి తోడను !
జలధి తరగల మ్రోతవలె మది
నలరు కాంక్షను దెలిపితిన్ ! ॥విరహ గీతము॥

పూచినా, క్రొమ్మావి పైనీ
పొలుపు గులుకుచు తుమ్మెదల గమి
ఆడిపాడిన రీతి నీకై
యటమటించితి వేదనన్ ! ॥విరహ గీతము॥

చిలుకవలె నే విప్పి జెప్పితి
చిత్రమగు నా మనసు కోరిక !
జాలువారిన యేటివలె నే
వేల పదములు బాడితిన్ ! ॥విరహ గీతము॥

అంజలుల గైకొనుము మాధవ !
యవధరింపుము! ఆత్మ వేదన !
జ్యోతి జ్యోతిని గలియు వలకుసు
ప్రీతి, స్నేహము నిలుపుమా ! ॥విరహ గీతము॥

## అఖిలపతి నిను ఎడిచి వచ్చితి !

అఖిలపతి! నిను విడిచి! వచ్చితి!
అందలము దిగి క్రింది కొచ్చితి !
మఱల నీకై మగువ మాదిరి
మర్మముగ విలపించు చుంటిని ! ॥అఖిలపతి॥

ఉదయ సంధ్యల కాంతు లందున
నుదితమైనా యరుణ కాంతివి !
వేఱుబడి నే భువిని జడితిని !
వింత మలినపు కాంతినై ! ॥అఖిలపతి॥

ఊర్వశికి వలె నురుకులెత్తీ
పరుగులెత్తీ పరవశించీ !
ఉర్వి సుఖముల నందగా నే
నూడి ఒడిలితిని ధరణిపై! ॥అఖిలపతి॥

పుడమి సుఖముల ధూతి నెఱిగితి
పున్నమి వెన్నెలల జూచితి !
ఎండమావు లటంచు దెలిసితి !
అంద నీవే యలటినీ ! ॥అఖిలపతి॥

ఇంక కను గొను నీదు జ్యోతిని
అంతరంగము హత్తుకొనుమా !
కాంత యపరాధము! క్షమింపుము!
కాంతుడవు గద! సత్కృపన్ ! ॥అఖిలపతి॥

## అది యంతములేని విన్నా !

అది యంతములేని, విన్నా!
యందముగ నొక రూపు గూర్చి!
మనసునను భజియించు చుంటిని
మాధవా! యిది దోషమా? ॥అది యంతము॥

అంబుధికి పలె నంత మెఱుగని
యావలొడ్డుకు జేరగా నే !
వింతగా నీ సాయ మడుగుట
విన్నపం బది దోసమా? ॥అది యంతము॥

ఒక్కపాదము భూమియంతము
నాదిగి పోయిన వింత విందును !
అట్టి నీ హృది నుండగోరుట
యనఘ! యిది యన్యాయమా ? ॥అది యంతము॥

కోటి కోటీ లోకములకును
గూర్మి నేతవు ! రక్షకుండవు !
అట్టి నీ దయ నందగోరుట
యధిప! యది విపరీతమా ? ॥అది యంతము॥

అట్టి మంగళ ధాముడివు! నే
నందుకే నీ శరణు వేడితి !
ఎట్టికోర్కెలు లేవులే! నా
యిష్టమును నీ వెఱుగుదువులే ! ॥అది యంతము॥

## జన్మ జన్మల బంధ మిదిరా !

జన్మ జన్మల బంధమిదిరా !
జారి పోదేనాటి కైనను !
మధుర స్నేహపు ముడులురా యివి
మాసిపోవే నాటికైనను! ॥జన్మ జన్మల॥

మధు వసంతము నీవుగావా ?
మధుర కోకిల నేనుగాదా ?
ఆ మనోహర మంజులంబగు
అఖిల నీ నా స్నేహముల్! ॥జన్మ జన్మల॥

నే మయూరిని! నీవు మేఘము!
నృత్య మాడెద! నిన్ను జూడగ !
అంత తీయని ప్రీతి బంధము !
అధిప! నీకును నాకునూ! ॥జన్మ జన్మల॥

నీవు స్వామివి! నేను దాసిని!
నిత్య నూతన! యచ్యుతా! హరి!
జన్మ జన్మలు గడిచినా నీ
స్మరణ మానితినా మరి? ॥జన్మ జన్మల॥

ఆరిపోని దీపమును వలె
అంబరంబున ధ్రువుని పోలిక
వీడిపోని స్నేహ బంధము
వేయి జన్మల కైననూ! ॥జన్మ జన్మల॥

## మబ్బు చాటున చందమామగ

మబ్బు చాటున చందమామగ
మర్మమేలను గానిపింపగ?
ఒక్క మాటిటు వచ్చి దయ గను!
నిక్కటులలో నుంటిరా! ॥మబ్బు చాటున॥

ఆకు చాటున పూవు లాగున
యంతటి కినుకేల స్వామీ!
కంటికి కవిపించి పోయిన
కాసులన్నీ గొందునా? ॥మబ్బు చాటున॥

ముద్దుగా మోహన యనంటిని!
రద్దిజేసితి! రవలుజేసితి!
చాటుగా నొక పలుకు బలికిన
నోటిముత్తెము రాలునా! ॥మబ్బు చాటున॥

పలుకులే బంగార మాయెను
బరగ నీ దయ యెంత దూరము!
ఓరచూపే కఠినమాయెను!
ఓర్వలేనుర! నిర్దయా! ॥మబ్బు చాటున॥

నవరసంబులు నాట్యమాడే
నవ్యగీతము బాడి జూపితి!
సవ్యమని తల యూపి యాపిన
సర్వమును హరియింతునా? ॥మబ్బు చాటున॥

## ఏటియందున శిలకు వోలెను

ఏటియందున శిలకు వోలెను
నీటియందున దొరలు కొనుచును!
సన్న నై శివలింగమునువలె
చెన్నుగా నే మారుచున్! ॥ఏటియందున॥

వేదనాశ్రువులందు మునుగుచు
విరహమున నే సుడులు దిరుగుచు!
ఏటిపాటను బాడుకొందును
నీటియలలను మునుగుచున్! ॥ఏటియందున॥

పడవ పాటకు జతగ బాడుచు!
పరవశించి భక్తితోడుత!
చిన్నికృష్ణుని విరహగీతము
చిట్టి పొట్టి మాటలన్! ॥ఏటియందున॥

దరుల యందున క్షణము నిలిచి
తరుల యందున పూల తీవెల!
చిన్నికృష్ణుని వార్తలను వే
చెన్నుగా నే నడుగుదున్ ॥ఏటియందున॥

అలలయందున దొరలు కొనుచును
అరిగి యరిగీ తరిగి తరిగీ!
అలరి కృష్ణుని యందు గలియుదు
అతని హృది నే జేరుదున్! ॥ఏటియందున॥

## రంగు రంగుల పూలపుప్పొడి

రంగు రంగుల పూల పుప్పొడి
రసములను నే నేర్చి కూర్చి !
నీ మనోహర రూప చిత్రము
నీరజాక్షా ! వ్రాసితిన్ ! ॥రంగు రంగుల॥

కోకిలమ్మా కూర్మి మెచ్చుచు
కుహుకుహూ యని పాటబాడెను !
చిలుకకన్నెలు చిత్ర మనుచును
జేరి జూచెను మెచ్చుచున్ ! ॥రంగు రంగుల॥

అంచ కన్నెలు నలరిజూడగ
యందెలా రవళులను మూగి !
పికిలి పిట్టలు ప్రీతిజూచెను
ప్రియతమా ! నీ చిత్రమున్ ! ॥రంగు రంగుల॥

కొలని లోపలి కలువ భామలు
కొసరిజూచెను లేడి పడుచులు !
వన్య మృగములు ! వనవిహంగము
లన్ని మెచ్చెను చిత్రమున్ ! ॥రంగు రంగుల॥

ఎవరు మెచ్చిన మెచ్చకున్నను
నీవు మెచ్చగ నే లిఖించితి !
మనసులో ప్రతిబింబమే యిది !
మాధవా ! యీ చిత్రమూ ! ॥రంగు రంగుల॥

# విరహగీతము బాడుకొనుచును !

విరహ గీతము బాడుకొనుచును
వీధులందున దిరుగుచుంటిని !
కిన్నెరను నే మీటుకొనుచును
కీర్తనల శ్రుతిలయల బాడుచు ! ||విరహ గీతము||

కొలకులందున కలువ భామల
కూరిమిని తామరల గాంచుచు !
మురళిలోలుని యడుగుచుంటిని
మోదమలరగ గాంచిరా యని ! ||విరహ గీతము||



పరుగులెత్తే లేడి కనుగొని
పాట నాపి మాట యనుచును !
చిన్నికృష్ణుని జూచిరా యని
జేరి యడిగితి విన్నపముగా ! ||విరహ గీతము||

వంగినా కొమ్మలును గలిగిన
చిన్ని చిన్ని పూలతోడను!
అందమగు తరువులను నడిగితి
చందమగు శ్రీకృష్ణదేవుని ! ||విరహ గీతము||

పాడుకొనుచును బోవుచుంటిని !
ప్రవిలమగు నా హృదయగీతిని !
కంటినీరము లొలుకు చుంటిని !
కాల్వలై జన వనములందున ! ||విరహ గీతము||

## సుందరంబగు నీదు మోమును

సుందరంబగు నీదు మోమును
అందముగ నే హృదిని గాంచుచు !
చెన్నుగా నిను బిలుచుచుంటిని
వన్నెలా కృష్ణా ! ॥సుందరంబగు॥

అంతరంగము నందు నెపుడును
నాడుచుందువు మురళి తోడను !
చిందుచును జిఱుగజ్జియలతో
జేరి నృత్యములన్ ! ॥సుందరంబగు॥

కొండ కోనలనుండి వినబడు
మెండుగా నీ మురళి స్వనములు !
వంతపాడును ప్రకృతి యంతయు
సంతసము తోడన్ ! ॥సుందరంబగు॥

నింగితారల నుండి వినబడు
రంగుగా నీ మురళి గానము !
వెన్నెలా దీవెలను మీటగ
సన్నగా ధ్వనులన్ ! ॥సుందరంబగు॥

మల్లె పూవుల దండతోడను
మది హరించెడి నెమ్మిపించము !
చిందుచును జిఱునవ్వులను మఱీ
జేరవత్తువుగా ! ॥సుందరంబగు॥

## కలత నందను ! నలత జెందను !

కలతనందను ! నలత జెందను !
కామితమున నిరాశ జెందను !
ఎన్ని జన్మలుగాని యిటులను
సన్నుతించుచు నుందునూ ! ॥కలతజెందను॥

చిన్నిపాటల బాడుకొందును
వన్నెలను నిను మదిని గాంచుచు !
కన్నెగా నల గొల్లభామగ
చిన్నెలను విరజిమ్ముచున్ ! ॥కలతజెందను॥

ఆఱుఋతువుల యందునను మఱి
యలమటించుచు నిన్ను గాంచగ !
వేదనల రాగముల దీయుచు
వేడు కలరగ నుండెదన్ ! ॥కలతజెందను॥

చిగురుటాకుల చిన్ని పూవుల
చిత్రమగు సెలయేఱులను మఱి !
మనసునందున కృష్ణవిరహము
మమతతో నే దెలుపుదున్ ! ॥కలతజెందను॥

నీదు రాకకు వేచియుండెద
నిర్మలంబగు భక్తి తోడుత !
కనులలో భాష్పములు రాల్చుచు
కామితము నే గోరుచున్ ! ॥కలతజెందను॥

## మల్లె పూవుల మాల యెచటికి ?

మల్లెపువ్వుల మాల యెచటికి?
మౌనముగ పయనించు చుంటివి ?
అలలపైనీ తెరలపైనీ
అందముగ వాసనలు జిమ్ముచు ! ॥మల్లెపూవ్వుల॥

నేను జెందిన విరహ వేదన
నేను బాడిన విరహ గీతిక !
నాధునకు వినిపించెనా మఱి
నాదు గీతిక నాదముల్ ! ॥మల్లెపూవుల॥

వేదనల మది నందకనుచును
విరహ బాష్పము లొలుక కనుచును
దెలిపినాడా ప్రాణ విభుడును
తీయనీ భాషణలతో ! ॥మల్లెపూవుల॥

వచ్చుచుంటిని యనుచు బలుకుచు
మాచ్చికను నిను దెల్పు మనుచును !
దీరమున నే నున్న చోటికి
జేరుకొమ్మని బలికెనా? ॥మల్లెపూవుల॥

అతని మాటల యాలకించీ
అందముగ పయనించి యిచటికి
మచ్చికను నిటు వచ్చినాదా!
మధురిమల నిల జిందుచున్ ! ॥మల్లెపూవుల॥

## అలసిపోవుట లేదు కృష్ణా !

అలసిపోవుట లేదు కృష్ణా !
అందమగు నా మధుర గీతము ;
నిన్ను మదిలో దలచు నెపుడును
నీదు విరహము తోడుతన్! ॥అలసిపోవుట॥

గుండెలోపల కుమిలి పోవదు !
కూర్మి తనలో చిన్న బోవదు !
సొగసుగా నిను దలచి మదిలో
శోకమును రానీయదూ ! ॥అలసిపోవుట॥

వెన్నెలా వాకలను జడియదు !
వేడు కలరగ పాట బాడును !
మనసు నిబ్బరమునను నుంచును
మధురిమలనూ జిమ్ముచున్ ! ॥అలసిపోవుట॥

సంజలా వన్నెలను గాంచుచు
సరసతను మది గోలుపోవదు !
పూవులా పొదలన్ని దాటును
బూనికను వన సీమలన్ ! ॥అలసిపోవుట॥

నిన్న మొన్నను నంకురించిన
సన్ననీ విరహమును గాదూ !
ఎన్నినాళ్ళదొ? జన్మజన్మల
వన్నె బాకిన విరహమూ ! ॥అలసిపోవుట॥

# కలువ పూవుగ యుండి కొలనున

కలువపూవుగ యుండి కొలనున
కమ్మనీ వాసనల జిందుచు !
నిర్మలంబగు భక్తి తోడుత
నీదు గీతము బాడుచున్ ! ॥కలువపూవుగ॥

వెన్నెలా వానలను దడియుచు
వేడు కలరగ చందమామను !
చిన్నితారల కనులగాంచుచు
కణ్ణ! నిను నే బాడుచున్ ! ॥కలువపూవుగ॥

నీటిపక్షుల కలకల ధ్వని
నిరవధికమగు తుమ్మెదల ధ్వని !
మలయ మారుత వీచికలకును !
మది చలించును వేడుకన్ ! ॥కలువపూవుగ॥

గాలిలేనీ సమయ మందున
కలతలేనీ దీపమునుగా !
నీదు రాకకు నెదురుజూచుచు
నిలిచియుండుదు భక్తితోన్ ! ॥కలువపూవుగ॥

గ్రీష్మ మందున యేటి పాటగ
సన్న సన్నగ విరహ గీతము!
పాటబాడుచు నుందు కృష్ణా !
బరవశించుచు నా కుటిన్ ! ॥కలువపూవుగ

## హృదయమా! రొద లింక మానుము !

హృదయమా! రొద లింక మానుము
సదయుతై విలపింప మానుము !
అదిగొ! మురళీ మధుర స్వనములు
నాలకింపుము నెచ్చెలీ ! ॥హృదయమా॥

దిక్కు లన్నియు తేజ మాయెను
మిక్కిలీ పువ్వొడులు రేగెను!
మందపవనుని మర్మర ధ్వని
మధురిమల నదె! గాంచవే ! ॥హృదయమా॥

సప్తస్వరముల సరసగీతము
సరసముగ యంతట ధ్వనించెను !
అఖిలలోకము నణువు నణువును!
నలరుటను గమనింపవే! ॥హృదయమా॥

దివికి భువికీ దివ్యతేజము
తీవెలై వారధిని గట్టెను !
ఇన్ని నాళుల యిష్టదైవము
నింపుగా నట దోచెడిన్ ! ॥హృదయమా॥

మధుర మురళిని చేత బట్టుక
మంజులంబగు నభయ ముద్రను !
భువిని పాదము బెట్టెనే హరి
భూతకోటిని గావగన్ ! ॥హృదయమా॥

## ఒంటరిగ దా విపిన మందున

ఒంటరిగ దా విపినమందున
ఇంట నీవని చిన్నికృష్ణా!
కంట నీరొలుకుచును మదిలో
చింతి పొంగ నేర్చుచున్! I.ఒంటరిగ॥

వారి పౌశవుస విరుల నేరుచు
వేదనను కన్నీరు రాల్చుచు!
మాలగా గ్రుచ్చినది నీకై
మనసునను నిను దలచుచున్॥ ॥ఒంటరిగ॥

చిలుకలను గోరింకలను మఱి
జేరి కోకిల నడుగుచును దా
తరువులను బూ దీవెలను దరి
కొలను తామర పూవులన్! ॥ఒంటరిగ॥

అందమైనా లేడి కనులను
చందముగ గాంచుచును నీకై!
చిందినా వేదనల తోడను
కంటి నిను బ్రతిమాలుచున్! ॥ఒంటరిగ॥

విపిన వీధిని నిన్ను బాడుచు
వేదనను మీటుచును కిన్నెర!
నన్ను బంపెను హంసభామను!
నన్ను గనుమాంజలులతోన్! ॥ఒంటరిగ॥

## పతిని బిలువగ బంపుచుంటిని!

పతిని బిలువగ బంపుచుంటిని!
బరగ నిను ఓ రాజహంసా!
వినయముగ వినిపింపు విభునకు
విమలమగు నా ప్రార్థనల్! ॥పతిని॥

దూరభారం బనుచు మనసున
దారి తప్పకు జారిపోవకు!
కాటుకను కన్నీరు తోడను
పాట వ్రాసితి లేఖలన్! ॥పతిని॥

జన్మ జన్మలనుండి గోపిక
జాలిగా ప్రార్థించు చున్నది!
విమలమగు గీతములఁబాడుచు
నమలమగు భావములతో! ॥పతిని॥

నిర్మలంబగు కొలని లోపల
నిలిచి జూచెడి కలువభామగ
దీపమునువలె నిన్ను గాంచుచు
దీనతను బ్రార్థించుచున్! ॥పతిని॥

నీ నిరీక్షణమందు దాసిగ
నిలిచి యున్నది భక్తితోడుత
ఆదుకొను మని తెలుపవే సఖి!
యందుకొను మను వినతిని॥ పతిని॥

## కందిపోయెను చిందిపోయెను!

కందిపోయెను! చిందిపోయెను!
కమ్మనీ నా విరహగీతము!
చిన్నికృష్ణుని మది దలంచుచు
వెన్నెలలు గురియున్! ॥కందిపోయెను॥

అతని గాంచగ మది దలంచుచు
నాలపిలపగ మధుర గీతము!
పన్నుగా పదములను నంటగ
పాట మది దలచున్! ॥కందిపోయెను॥

కొండ కోనలును ధ్వనింపగ
కూడి కోకిలతోని జతగా!
వెన్నె లందున పాట బాడగ
విమలతర వాంఛన్ ! ॥కందిపోయెను॥

తీయతీయని తేనె పాటల
తీరుగా దా మునిగి తేలుచు!
సన్ననీ సెలయేటి జాలున
సఖియ రాగములన్! ॥కందిపోయెను॥

విరహగీతము తనదు బ్రదుకని
విరహమే తన జీవ మనుచును!
వేడు కలరగ కృష్ణభక్తియె
విమలపథ మనుచున్! ॥కందిపోయెను॥

## హంసభామా! యరుగు మరుగుము!

హంసభామా! యరుగు మరుగుము!
అతిరయంబున నాదు కడకున్!
మధుర స్వరమున బలుకు మమ్మా!
మాధవునితో నాదు విరహము! ॥హంసభామా॥

కలువ కావగ మారె ననుచును
కాంతి హీనంబాయె ననుచును!
ఉంగరాలే దండకడియము
లంగనకు భాసించె ననుమా! ॥హంసభామా॥

నిన్ను వెదుకుచు నూరువాడలు
నిరసించిన దనుచు బలుకుము!
కిన్నెరను జతజేసి పాడుచు
చిన్నెలన్నియు బాసెననుమా! ॥హంసభామా॥

కంఠ మేమో సన్నబడియెను
కంటినీరే కాల్వ లాయెను
వింతగా జనులంత జూచి
'వెఱ్ఱి' యంచును బలికి రనుమా! ॥హంసభామా॥

తప్పులను మది నెంచకనుమా!
తిప్పలను నన్ను బెట్టకనుమా!
ఆత్మ నీ కర్పణము జేసిన
యతివ! యను నెమ్మదిగ విభుతో! ॥హంసభామా॥

# వెన్నెల నురుగులు

వెన్నెల నురుగులు విరియించేటి!
వేలకాంతులను వెలయించేటి!
కిన్నెరసానీ యొడ్డున గూర్చొని
సన్ననిగొంతున కీర్తించా! ॥వెన్నెల॥

కలకల పారే కృష్ణమ్మానది
గలగల పారే గోదావరినది!
ఒడ్డున నిలిచీ ఓ ప్రభూ! యనుచు
ఒక్కొక్క గీతము ఘోషించా! ॥వెన్నెల॥

భద్రాచల యారామ భద్రునీ
భక్తిని తిరుపతి వెంకన్నలనూ!
పాదయాత్రలను గనుగొని తీరుగ
భక్తిని కీర్తన లాలికించా! ॥వెన్నెల॥

శ్రీశైలమునూ, సింహాచలమును
జేరి దేవతల నందఱ గొలిచి!
తెలుగు పూవులను బూజించిమఱి
తెలుగు కీర్తనల స్తుతియించా! ॥వెన్నెల॥

ఏ తీర్థము! ఏ క్షేత్రము జూచిన
ఇందు నందునను నెందును విందును!
నీ మురళీ స్వర మధుర గానమే
నిఖిలం మంతయును వినిపించునే! ॥వెన్నెల॥

## మధుర కిన్నెరను జేతనుబట్టి!

మధుర కిన్నెరను జేతనుబట్టి
మంజులంబునగు గీతముతోసి!
వాడవాడలను వెదికితినీ! నీ
జాడ వెఱుకుచును నలసితినీ! ॥మధుర॥

నిన్ను వెదుకుచును నీరసించినా
వన్నెలాడినీ గాదటరా!
ఎందు దాగితివొ! శ్రీరమణా! న
న్నెందు కిట్టులన వేతువురా? ॥మధుర॥

ఎదురు వడిన యా సాధు పురుషులను
ఎచ్చట యని నిన్నడిగితినీ!
మల్లె మాలతీ పూలతీవెలను
ములతీ లతల నడిగితినీ! ॥మధుర॥

ఎవ్వరు దెలుపరు నీదు జాడలను
ఎందు వెదికినా కనబడవూ!
కన్నుల నీరే కాలువ గట్టెను
కఠిుగ దాయెగా నీ మనసూ! ॥మధుర॥

కొమ్మపిడినా తీవెలాగు నే
నెన్నో యిడుమల బడుచుంటి!
కన్నా! నీవే దిక్కని యంటిని!
కనికరింపుమా! గోపికనూ! ॥మధుర॥

## అందఱిలో దెలపాలంటే

అందఱిలో దెలపాలంటే
అది యేమో! భయం భయం!
ఒంటరిగా దెలపాలంటూ
ఉందీ నా మనోరథం! ॥అందఱిలో॥

లయ తాళం తోడు లేక మఱి
లాలిత్యం ఒలకబోస్తూ!
మధురాక్షర పదములతోనే
మధురగీతి పాడాలనీ! ॥అందఱిలో॥

కొండలలో కోనలలో
కూరిమి వన వీధులయందున!
వేరెవ్వరు లేనిచోటనూ
వివరించాలని వుంది! ॥అందఱిలో॥

మలి సంధ్యల కాంతులు వడినా
మందారపు చిగురుల క్రిందా!
పున్నమినీ వెన్నెలరాత్రి
పూరింట్లో నిశ్చలభక్తిని! ॥అందఱిలో॥

నీ మురళీ స్వనముల లోపల
నిర్మలమై పోవాలనీ!
నీ జ్యోతిని జ్యోతిని గలిసీ
నిత్య శాంతి పొందాలనీ! ॥అందఱిలో॥

రచయిత యితర గ్రంథములు

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ గ్రంథాలయ సంస్థవారి అనుమతి నందబడినవి.

# లలిత గీతాలు

(పుస్తకముల కన్నింటికి సైబేషను నంబర్లు గలవు)

| | |
|---|---|
| 1) విజయ మంగళం | 4-00 |
| 2) ఆనంద మంగళం | 4-00 |
| 3) పాలేటి తరగల్లో మల్లి | 6-00 |
| 4) శ్రీరామచంద్రసుత (కీర్తనలు) | 4-00 |
| 5) కృష్ణదాసి | 4-00 |
| 6) చిగురులు-పువ్వులు | 4-00 |
| 7) హరిదాసి (గోదాదేవి పాటలు) | 2-00 |
| 8) గిరిజా కల్యాణము (ద్విపదలో) | 10-00 |
| 9) శ్రీగోదాదేవి పాటలు | 2-00 |
| 0) పూలరథం (గేయములు) | 6-00 |
| 1) మౌనగీతాలు | 6-00 |
| 2) కన్నీటి పువ్వులు | 6-00 |
| 3) శాంతిగీతం | 6-00 |
| 4) మధుర గోపిక | 8-00 |
| 5) మురళీస్వనాలు | 8-00 |
| 6) పిల్లనగ్రోవి పిలుపులు | 8-00 |
| 7) సుందరకాండము | 15-00 |
| 8) శ్రీమురళి | 10-00 |
| 9) దీపలేఖ (చదువు వెలుగు నాటిక) | 8-00 |
| 0) వీధి దీపం (కవితలు) | 5-00 |

## నూతన ప్రచురణలు

1) ఆనంద యాత్ర (లలిత గీతాలు) 20-00
2) మంచు ముత్యాలు " 12-00
3) శ్రుతిలయలు " 12-00
4) శ్రీ భగద్గీత (చతురస్ర గీతికలలో) 18-00
5) కలబోసిన ముత్యాలు (సూక్తులు)
(1000 ఆటవెలది, గీత పద్యాలలో) 20-00
6) శ్రీరామకథా సుధాలహరి
బాలకాండము (చతురస్ర గీతికలతో) 25-00
7) సుందరకాండము (సైటేషను నంబరు గలదు) 15-00
8) విరహగీతము (ముత్యాల సరాలలో) 20-00

## వెలువడనున్న గ్రంథములు

1) ఆనంద గ్రంథి (లలిత గీతాలు)
2) శ్రీరామకథాసుధాలహరి (చతురస్రగీతికలలో)
(అయోధ్యకాండము) - మొదటి భాగము

ప్రతులకు :

పి. దుర్గారావు యం.ఓ.యల్. అడవి దేవులపల్లి P. O.
(వయా) మిర్యాలగూడ, నల్లగొండజిల్లా : 508 207.